

# "పరదేశి" భారత-సోవియట్ సహకార ప్రతిఫలం

"పరదేశి". 15వ శతాబ్దంలో భారత దేశంలో పర్యటించిన రష్యన్ వర్తకుడు అఫనసీ నికితిన్ సాహస గాథను చిత్రించే ఈ ప్రప్రథమ భారత-సోవియట్ ఫిల్మ్, డిసెంబరు మాసారంభంలో భారత సోవియట్ దేశాలలో విడుదల చేయబడుతున్నది.

"పరదేశి" చిత్రం, సోవియట్ "మాస్ ఫిల్మ్" సినిమా స్టుడియో, భారత "నయా సంసార్" ఫిల్మ్ స్టుడియోలచే ఖ్వాజా అహమ్మద్ అబ్బాస్, మరియా స్మిర్నోవాల సృష్టిననుసరించి సంయుక్తంగా నిర్మించబడినది.

అనేక విధాల ఈ చిత్ర నిర్మాణం అపూర్వమైనది, అద్వితీయమైనది. రెండు దేశాల సినీ కళాకారులు, వ్యాపార లాభాల దృష్ట్యా తీసిన ఏదో ఒక చిత్రంగా గాక ఇది, రెండు దేశాల ప్రజలను ఒకరినొకరికి సన్నిహితంగా తీసుకవచ్చి వారి స్నేహ సంబంధాలను పటుతరం చేయుటలో ఫిల్మ్ ఎటువంటి ఉత్తమ సాధన కాగలదో నిరూపించటానికి దృష్టాంతం కాగలుగుటలో ధమనివలె దీని వైశిష్ట్యం ప్రస్ఫుటమవుతున్నది.

ప్రతి ఒకరూ తప్పక చూడవలసిన చిత్రం.

మూడు సంవత్సరాల క్రితం, అఫనసీ నికితిన్ స్మారక చిహ్నన్ని, ఓల్గా నదీ తీరానవున్న ఆయన స్వస్థలమయిన కాలినిన్‌లో ఆవిష్కరించుటలో సాయపడే గౌరవం నాకు లభించింది. ఇప్పుడు మరి, ఆయన భారతదేశ యాత్రను, సాహస కృత్యాలను ప్రతిరూపించే సంయుక్త భారత-సోవియట్ చిత్రాన్ని సందర్శించే సదవకాశం లభించింది. ఇది, ఉభయదేశాలకు గర్వకారణమైన చక్కని చిత్రం. భారత-సోవియట్ దేశాల సంబంధాలు, అఫనసీ నికితిన్, ఆయన భారత మిత్రుల మధ్యన పరస్పర సంబంధాలు ఎటువంటి సద్భావంతో, అంగీకారంతో, విచక్షణతో, ఒకరినొకరు అర్థం చేసుకొని, ఒకరిపట్ల మరొకరు గౌరవాదరాలతో, శ్లాఘా పాత్రంగా, ఒకరినుండి మరొకరు నేర్చుకొంటూ, ఒకరికొకరు ఇచ్చి పుచ్చుకోవడంలో ప్రాపకానుగ్రహాల కేమాత్రం ఎడమివ్వక, తమతమ సంప్రదాయాన్నీ సంస్కృతినీ పరిత్యజించకుండా వర్థమానమైనట్టు, అదే ప్రాదిపదికమీద పెంపొందుతున్నందుకు నేను ఎంతో సంతోషిస్తున్నాను.

కె. పి. ఎస్. మీనన్
సోవియట్ దేశంలోని భారత రాయబారి

సం.పుటి 8,
సంచి. 23.

# సోవియట్ భూమి

డిసెంబర్ 13,
1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచార శాఖ ప్రచురింపబడుతున్న సచిత్ర పక్ష పత్రిక



## రాబోవు సంచికలో






భిలాయ్ ఉక్కు పరిశ్రమాగారం. భిలాయిలో సోవియట్, భారత నిపుణులచే నిర్మితమవుతున్నది. భారత దేశపు పంచవర్ష ప్రణాళికలో ప్రముఖ స్థానంవున్న నిర్మాణమిది.

మా రాబోవు సంచిక, భిలాయ్ ఉక్కు పరిశ్రమాగార ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. త్వరగతిన సాగిపోతున్న ఈ నిర్మాణ కృషిని వివరించే ప్రత్యక్షసాక్షుల వర్ణనలూ, ఈ కృషిలో నిమగ్నమైవున్న సోవియట్ భారత ప్రజల జీవిత చిత్రణలూ ఉంటాయి.

ఇంకా ఈ సంచికలో ఆసక్తిని కలిగించే ఈ దిగువ విషయాలకు సంబంధించిన రచనలు :

* పరిశ్రమాగారపు సాంకేతిక ప్రాముఖ్యము.
* పరిశ్రమాగారపు వివిధ విభాగ కృషిని వివరించే ఛాయాచిత్ర సంపుటీకరణ.
* జనరల్ మేనేజర్ శ్రీ శ్రీవాత్సవ, భారత, సోవియట్ నిపుణులతో ఇంటర్వ్యూలు.
* సోవియట్ ప్రజల సాంఘిక జీవితం, విరామ కాలక్షేపాలు. ఇంకా ఈ సంచికలో అనేక ఇతర వ్యాసాలు, చిత్రాలుంటాయి. ఈ సంచికలో వెలువడనున్న ఛాయాచిత్రాలు శ్రీ పి. ఎస్. శర్మ తీసినవి.
* కాగా పరంపరగా వెలువడే శీర్షికలతోపాటు, ఈ సంచికలో సంయుక్త భారత-సోవియట్ చిత్రం, "పరదేశి"కి సంబంధించిన ప్రత్యేక రచనలుంటాయి.

మీ ప్రతికై త్వరపడండి!

## ఈ సంచికలో



# స్నేహభావం

పృథ్వీరాజ్ కపూర్, యం. పి.
భారత సోవియట్ మైత్రీసంఘ ఉపాధ్యక్షుడు,
మహమ్మద్ గపూర్ పాత్రధారి

చలన చిత్రం "పరదేశి"లో రష్యన్ యాత్రికుడు అఫనసీ నికితిన్ భారత దేశానికి వెళ్ళి, భారతీయుల జీవితం గురించి తెలుసుకోవడానికి ఎన్నో కష్టాలు పడతాడు. దురదృష్టవశాత్తు భారత దేశంలో చాలా కొద్దిమంది మాత్రమే అఫనసీ నికితిన్ యాత్ర గురించి విన్నారు. చదువుకున్నవారిగా పరిగణింపబడేవారు మాత్రమే —వారిలోకూడా అందరూ కాదు—దీనిని ఎరుగుదురు. రష్యన్, భారతీయ ప్రజల సహకారం నాలుగు వందల ఏళ్ళుగా వుందని లక్షలాది మంది ప్రేక్షకులకు ప్రదర్శిస్తూ, మేము నేటి సహకారాన్ని పటిష్టపర్చుకున్నాము.

మాస్కో ఫిల్మ్ స్టుడియోలలో నిరంతరం వ్యాపించివుండే స్నేహ భావానికీ, కష్ట సమయంలో సాయపడే వాంఛకూ భారతీయ కళాకారులమంతా ముగ్ధులమయ్యాము. ఇక్కడ పనిపట్ల వున్న దృక్పథం, తన మత విశ్వాసంపట్ల ఆస్తికునికుండే దృక్పథం వంటిది; యింకో మాటలలో చెప్పాలంటే అది అతిపవిత్రమైనది. ఇక్కడ రుసరుసలాడే ముఖం ఎన్నడూ కనిపించదు, దుష్ట వాతావరణ పరిస్థితులు షూటింగును చెడగొట్టిన పరిస్థితుల్లో తప్పితే; అటువంటి రోజున అందరూ తమ వ్యక్తిగత శత్రువును చూసినట్టుగా చూసేవారు ఆకాశాన్ని. అక్కడికి వెళ్ళి, శత్రువు నుండి అసంఖ్యాకమైన మేఘాలనుండి-సూర్యునికి విముక్తి కలిగించి, అతనిని షూటింగు జరిగేచోట ప్రేలాడగట్టాలనుకునేవారేమో.

నాకు బాగా నచ్చిన యింకో విషయం ఏమిటంటే, యిక్కడ దర్పాన్ని కనపర్చేవారెవరూ లేరు. మీ నిర్మాతలూ, మా నిర్మాతలూ సమాన హోదాలో పనిచేస్తూ వున్నందుకు నాకు సంతోషంగా వుంది. స్నేహమూ, సహకారమూ సంపూర్ణమైన సమానత్వం మీదా, నిజాయితీ మీదా మాత్రమే వర్ధిల్లగలవు.

పార్లమెంటు సభ్యునిగానూ, భారత-సోవియట్ మైత్రీ సంఘ ఉపాధ్యక్షునిగానూ సోవియట్ ప్రజల గురించీ, వారి సహృద్భావం గురించీ, ఆతిథ్యం గురించీ స్వదేశానికి తిరిగి వెళ్ళి ఎంతో చెప్పదలుచుకున్నాను.

# సోవియట్లకే సర్వాధికారం!

వె. లిబెదిన్స్కీ, సోవియట్ రచయిత

(ఆత్మ కథా సంక్షిప్తం)

## 1

ప్రజా సామాన్యపు జ్ఞాపకశక్తి వాస్తవంగా మహత్తరమైనది: 1905 విప్లవం ఓడిపోయిన తరవాత, జారిస్టు ప్రభుత్వం తన భృత్యుల సహాయంతోనూ, సహాయం లేకుండానూ, శ్రామిక ప్రజాప్రతినిధుల సోవియట్ల జ్ఞాపకాన్ని రూపుమాపడానికి సాధ్యమైనన్ని విధాలా ప్రయత్నించినట్టు కనిపించవచ్చును. కాని 1917 ఫిబ్రవరిలో నిరంకుశపాలన కూలీ కూలడంతోనే, విప్లవశక్తిని గూడుకట్టుకొని వున్న యీ సంస్థలు, ప్రజాసామాన్యం చొరవ మూలంగా మొదట ముఖ్య పట్టణాలలోనూ, కార్మిక కేంద్రాలలోనూ, తదుపరి అసంఖ్యాకమైన చిన్న నగరాలలోనూ, పట్టణాలలోనూ పునరవతరించాయి. 1905లోవలెనే యింకోసారి ఒకొక్క ఫాక్టరీకీ, పరిశ్రమకూ, బొగ్గు గనికీ, ముడి లోహాలగనులకూ చెందిన కార్మికులు విప్లవోద్యమంలో పుట్టిన యీ సంస్థలకు తమలోని ఉత్తమోత్తములను, అత్యంత దృఢమనస్కులైన విప్లవకారులను పంపించాయి. 1905 రాజకీయానుభవం విస్మరింపబడలేదనీ, 1905 విప్లవంలో తాము నెలకొల్పిన అధికార సంస్థల సంస్కృతిని కష్టజీవులు పవిత్రంగా భద్రపరచుకున్నారనీ విదితమైంది. కార్మిక, సైనిక, కర్షక ప్రతినిధుల సోవియట్లు, ప్రజల విప్లవకృషిఫలితంగా ఉద్భవించిన నూతనమైన వాస్తవంగా ప్రజాభిమానయుతమైన అధికార రూపం.

దానిలోని నూతనాంశం, కూడూ గుడ్డాలేనివారు, కష్టజీవులు, పీడితులూ, సర్వదా అధికారుల పెత్తనానికి లోబడివున్నవారూ అధికారాన్ని చేపట్టడంలో వుంది. ఫ్యూడల్ ప్రభువుల, రాజుల, భూస్వాముల, పెట్టుబడిదారుల, పోలీసుల, అధికారుల పెత్తనంలో వారు వుండేవారు. కాని యిప్పుడు, యీ విప్లవశకంలో, తమకుతామే జీవితానికి సంబంధించిన అనేక విషయాలను నిర్ణయించి, తమకుతామే తమ వివిధ నిర్ణయాలను ఆచరణలో పెట్టే కార్యనిర్వాహక సంస్థలలోనూ కార్మిక కర్షక సైనికుల సోవియట్లలోనూ పని చేయడానికి తమలోని ఉత్తమోత్తములను పంపుతున్నారు.

ప్రజాప్రతినిధులు—కార్మికుల, రైల్వే పనివారి, చాకెతల, యిళ్ళలో పనిచేసే నౌకర్ల, దుకాణాలలో అమ్మకం పనిచేసేవారి, వైద్యుల, ఉపాధ్యాయుల అధికారపూర్వక ప్రతినిధులు—సమావేశమైనప్పుడు. సోవియట్లు ప్రజాధికార సంస్థ అనీ, నగర ప్రజలందరికీ కూడు గుడ్డలనిచ్చె సంస్థ అనీ వెంటనే స్పష్టమైంది.

రొమనోవ్ వంశపు నిరంకుశ పరిపాలనను



"కార్మిక, కర్షక, సైనిక ప్రతినిధుల సోవియట్లకే సర్వాధికారాలు" అన్న నినాదం క్రింద పెత్రొగ్రాడ్‌లో కార్మికులు, సైనికులు 1917, జులై 18న చేసిన ప్రదర్శన దృశ్యం





1919లో వి. ఐ. లెనిన్

✲

ప్రజలు కూలద్రోసిన 1917 ఫిబ్రవరి తరవాత యిటువంటి పరిపాలనా సంస్థలు దేశం అంతటా నెలకొల్పబడ్డాయి.

ప్రజా సోవియట్లు అప్పటికింకా రష్యా యొక్క అధికారపూర్వకమైన ప్రభుత్వంకాదు. కెరెన్‌స్కీ, రోద్యంకో, మిల్యుకోవ్‌ల తాత్కాలిక ప్రభుత్వం అధికారాన్ని వశపర్చుకుంది. రైతులకు భూమినీ, శిథార్థులకు రొట్టెను, యుద్ధంతో విసుగెత్తి పోయిన వారికి శాంతినీ యివ్వడానికి అంగీకరించక, సామ్రాజ్యవాద యుద్ధాన్ని కొనసాగించిన సామ్రాజ్యవాద బూర్జువా వర్గ ప్రభుత్వం యిది. ప్రజలకు రొట్టెను, భూమినీ శాంతినీ చేకూర్చగలది కార్మిక కర్షకుల అధికారం మాత్రమే. వాటికొరకు యిదిమాత్రమే పోరాడగలదు. ఇటువంటి అధికారం. కార్మిక కర్షక సైనిక ప్రతినిధుల సోవియట్ల రూపంలో తనపతాకగా ఉద్ఘరించింది.

"అధికారమంతా సోవియట్లకే!" అని అప్పుడు లెనిన్ ప్రకటించారు. లెనిన్ శిష్యులూ, ఆయన సృష్టించిన పార్టీ సభ్యులూ అయిన బోల్షివిక్కులు యీ లక్ష్యాన్ని కార్మిక ప్రజలకు చాటి చెప్పారు.

## 2

విప్లవం వచ్చేసరికి నా వయసు పద్దెనిమిదేళ్ళు. ఈ మహత్తర సంఘటనలు జరిగిన తొలి ఏడాదిని రియల్ స్కూలులో (సెకండరీ పాఠశాల) పెద్ద తరగతికి పంపబడ్డాను. కాని విప్లవం ప్రారంభమయ్యేటప్పటికి, పాఠశాల మాత్రమే కాకుండా, నా మనో వికారాలతోపాటుగా నా పూర్వపు అభిమాన కార్యాలన్నీ నీరసించిపోయి, వాటిలో ఆసక్తి నాకు నశించింది. ఒక్కటి మాత్రం స్పష్టంగా వుండేది : నేనేదో మహత్తరమైన దానిని చూస్తున్నాను. రష్యాలోని అత్యంత అభ్యుదయ కాముకులు దేని సాఫల్యంకోసమైతే త్రికరణ శుద్ధిగా, జీవితార్పణ చేసి తపించిపోయేరో దానిని నేను చూస్తున్నాను.

మూడు శతాబ్దాల జారిస్టు పీడన తరువాత, మా దేశ చరిత్రలో ఒక నూతనాధ్యాయం మొదలైంది. దీనికి స్పష్టమైన రుజువు ఏమిటంటే—వివిధ కార్యాలయాల బోర్డులపై నుండే రెండుతలల గద్దల బొమ్మల బదులు ఎర్ర జెండాలు వచ్చాయి; పోలీసులు, రహస్య పోలీసులు రద్దు చేయబడ్డారు; పరిపాలనా భవనాల ఎదుట, రైలు ప్లాట్‌ఫారాలమీద, ప్రతి స్మృతిచిహ్న పాదంవద్ద చౌకుల్లోనూ, నగరాలలోనూ నిరంతరం సభలు జరుగుతున్నాయి; ఆ అసాధారణ వసంతకాలపు వాతావరణంలోనే నూతనాతి నూతనమైనదేదో ప్రవేశించినట్టుగా కనిపిస్తూ వుంది.

చెల్యాబిన్‌స్క్‌లోని పలుస్తంభాల ప్రజా భవనం, ఆ నగరపు కార్మిక ప్రతినిధుల సోవియట్‌కు స్థానమయ్యింది. ఈ భవనం కొండ



కార్మిక గృహ శంకుస్థాపనోత్సవ సందర్భంగా 'హెర్మిటేజ్ గార్డెన్'లో జరిగిన సమావేశంలో వై. ఎం. స్వెర్డ్‌లోవ్ ఉపన్యసిస్తోన్న దృశ్యం



మీదనుంది. ఇది పట్టణంపైని వుండడంలో యిప్పుడు ప్రత్యేకమైన అర్థం స్ఫురిస్తూవుంది. కొత్త కార్మిక సైనిక ప్రతినిధుల సోవియట్ తీవ్ర కృషి దీనిలో జరిగింది. వార్తాపత్రికలు ఒక చేతినుండి యింకో చేతికి వెళ్ళాయి. చదవడమూ, వ్రాయడమూ వచ్చినవారు—అప్పుడు వీరు అట్టేమంది లేరు—నిరక్షరాస్యులకు బిగ్గరగా చదివి వినిపించారు.

సమావేశ ప్రారంభాన్ని సూచిస్తూ గంట మ్రోగగా, ప్రతినిధులు తమతమ స్థానాలను అలంకరించారు. ప్రజలు—వారిలో నేను కూడా ఉన్నాను—ప్రేక్షకుల స్థానాల్లో కూచున్నారు. వ్యతిరేక పక్షాలకు చెందిన వక్తల వాగ్వాదాలు నా బాల్య స్మృతుల్లో భద్రంగా ఉన్నాయి. ఆ మొదటి సోవియట్ దైనందిన కార్యక్రమాలను నేను ఎన్నడూ మర్చిపోలేను.

పిండిపడి, వికారంగా కనిపించిన ఒక సైనికుడు వేదికపైకి ఎక్కాడు. ఈయన సైనిక దళానికి చెందిన రొట్టెల తయారీ కేంద్రపు ప్రతినిధి. మిల్లు యజమానుల కుట్రమూలంగా ధాన్యమూ, పిండి కర్మాగారంగా రొట్టెల కార్ఖానాలలో దాచి వెయ్యబడ్డాయని వివరించాడు. స్థూలంగా చూస్తే దీనికి ప్రత్యేకమైన రాజకీయ ప్రాముఖ్యం లేనట్టుగా, యిదొక అప్రధాన విషయంగా కనిపించవచ్చును. కాని అప్పుడొక బోల్షివిక్కు—లేడి—అప్పటికింకా బోల్షివిక్కులు సోవియట్‌లో అల్పసంఖ్యలో ఉన్నారు—, సైనికుని మాటల అర్థాన్ని పూర్తిగా వివరించి చెప్పాడు. ధాన్యాన్ని, పిండినీ రహస్యంగా దాచివెయ్యడం వల్ల ధరలు ఎక్కువవుతాయి; తత్ఫలితంగా నగర ప్రజలు పస్తులుండవలసి వస్తుంది. కార్మికుల అజమాయిషీ వల్ల మాత్రమే యీ వ్యాపారస్తుల కుట్రలు భగ్నం చేయడం సాధ్యపడుతుంది.

కార్మికుల అజమాయిషీ! ఈ సామాన్యమైన, నిరాడంబరమైన మాటలలో ఎంత గొప్ప శక్తి గర్భితమైవుంది! సోవియట్ల కార్యకలాపాలను యివి నా మనస్సులో ఎంత స్పష్టంగా పునఃచిత్రణ గావిస్తున్నాయి! గిడ్డంగులలో వస్తువులను, ఉత్పత్తి జరుగుతూ వున్నప్పుడు లోహపు నిలవలనూ, ఇంధనపు నిలవలనూ సరిచూసి, రైళ్ళ రాకపోకలపై అజమాయిషీ పెట్టడం అవసరం. కార్మి



రోవ్నోలో ఒక సమావేశంలో కలినిన్ ప్రసంగిస్తోన్న దృశ్యం





సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ సభాపతి కె. వై. వొరొషిలొవ్, రెండుమాట్లు సామ్యవాద శ్రమవీర బిరుదాన్ని పొందిన వొరొషిలొవ్ సమిష్టిక్షేత్రాధ్యక్షుడు ఎస్. యురుజ్ క్వజయేవ్‌తో సంభాషిస్తోన్న దృశ్యం

కుల, కార్యాలయోద్యోగుల, అమ్మకందారుల సంఘాలు వెంటనే నెలకొల్పబడ్డాయి. వీరు ప్రతి చోటా చొచ్చుకపోయారు—పరిశ్రమల గిడ్డంగులనూ, యజమానుల చిఠాలనూ, బ్యాంకుల పుస్తకాలనూ, ప్రతి ఒక్కదానినీ అజమాయిషీ క్రింద నుంచాలి, ప్రతి ఒక్కదానినీ రిజిస్టరు చెయ్యాలి. ఇప్పుడు పురోగమిస్తోన్న కార్మికవర్గపు సామ్యవాద కృషిని వ్యక్తపంచిన తొలిపలుకులివి.

సోవియట్ సమావేశంలో చర్చింపబడేవి స్థానికావసరాలు మాత్రమే కావు. ప్రతి ఒక్క సోవియట్టూ, ఎంత మారుమూలను వున్నా సరే ఒక మాదిరీ విప్లవ శాసనసభ అయిపోయింది. ప్రతి ఒక్కటీ, విప్లవ వర్తమాన కాలంలోనూ, ముఖ్య పట్టణాలలో, యుద్ధ రంగంలో, రష్యా అంతటా, ప్రపంచం అంతటా సైతం జరిగే సంఘటనల గురించి శ్రద్ధ వహించేది.

సోవియట్ యొక్క ప్రచండ కార్యకలాపాలు హటాత్తుగా ముగిసినట్టుగా కనిపిస్తుంది. ప్రతినిధులు వసారాలలోనికి వచ్చి పొగ తాగుతూ, అప్పుడే టెలిగ్రాముద్వారా వచ్చిన వార్తలను తీవ్రంగా చర్చిస్తారు. తలుపు దగ్గర ఉండేది ఒక్క కావలా భటుడు మాత్రమే—ఇతడుసాధారణంగా సైనికుడై వుంటాడు—వసారాల్లోని సంభాషణను వింటాడు; సమావేశంలోని చర్చలనుకూడా ఆలకిస్తాడు.

"కామ్రేడ్స్! సోదరులారా! ఇక్కడకు రండి! వారు శాంతిగురించి మాటాడుతున్నారు!" అంటూ ఒక సైనిక యువకుడు కేకేశాడు, ఒక రోజున ప్రతినిధులు పొగ తాగుతూవుంటే వసారాలో.

తొందర తొందరగా సిగరెట్లనూ ఆర్పివేస్తూ కార్మిక, సైనికుల ప్రతినిధులు వెంటనే హాలులోనికి తిరిగి వచ్చారు.

సైన్యపు జుబ్బాను తొడుక్కొని వున్న ఒక సన్నని చిన్నమనిషి వేదికపైని నిలుచున్నాడు, యుద్ధ దుష్ఫలితాల గురించి తెలియజేస్తూ, వెంటనే యుద్ధంనుండి వైదొలగవలసిన ఆవశ్యకతను హెచ్చరిస్తూ. రైతులకు భూమినీ, కార్మికుల రొట్టెనూ లభింప జెయ్యాలంటూ. సోవియట్ల అధికారమూ, సామ్యవాద సంస్థాపన, ఒక్కటే దేశానికి మోక్షమార్గమని ఆయన చెప్పారు. నిశ్శబ్దంగా వున్న సభాసదులు ఎంతో ఆతృతతో విన్నారు.

అప్పుడే మేల్కొన్నవారిలా అగుపించిన,

ఖిర్గిజ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్కు సుప్రీం సోవియట్ ప్రతినిధి, రెండుమాట్లు సామ్యవాద శ్రమవీర బిరుదాన్ని పొందిన సమిష్టిక్షేత్ర రైతాంగన, మురకన్ నయిసజరోవా తన తోటివాళ్లతో సంభాషిస్తోన్న దృశ్యం



తమకు కనువిప్పు కలిగించినందుకు లెనిన్‌కూ, ఆయన అనుచరులకూ కృతజ్ఞులైన ఆ శ్రోతల ముఖాలూ, కళ్ళూ నాకెప్పుడూ జ్ఞాపకం వుంటాయి. దీన్ని గురించి ఆలోచించినప్పుడల్లా నాకు ఆనందంగా వుంటుంది. అవును, నేనొకప్పుడు వీటిని చూశాను, నా జీవితం వృథా కాలేదని చెప్పగలను.

## 3

అధికారాన్ని స్వాధీనం చేసుకోవాలన్న విషయం చర్చింపబడినప్పుడు చెల్యబిన్‌స్క్ సోవియట్ రహస్య సమావేశంలో నేను ఉండకపోయినప్పటికీ, నగర సోవియట్ ప్రతినిధులు ఒకరితరవాత ఒకరు ఎలా ముందుకువచ్చి, తమ ఓటర్ల అభిప్రాయాలను తెలియజెప్పి, వారి ఆజ్ఞలను చదివి వినిపించారో ఒక స్నేహితునినుండి తెలుసుకున్నాను. మేము అక్టోబరు విప్లవం గురించి తెలుసుకున్నరోజు తరవాత నిది జరిగింది, పరిశ్రమలలోనూ, సైనిక కేంద్రాలలోనూ చాలా సభలు జరిగాయి.

సామాన్య కార్మికులూ, రైతులూ కష్టమైన రాజ్య వరిపాలనను సాగించలేరని శత్రువులు అప్పుడు గొంతు చించుకున్నారు. రాజ్య వ్యవహారాల వివిధ శాఖలను నిర్వహించడానికి సోవియట్లచే నియమింపబడిన పీపుల్సు కమిసార్లను లక్ష్యపెట్టవద్దని, ప్రభుత్వ సంస్థల అధికారులకు వారు విజ్ఞప్తి చేశారు. పాఠశాలలలో పిల్లలకు బోధించవద్దని ఉపాధ్యాయులనూ, ఆస్పత్రులలో పనిచెయ్యవద్దని వైద్యులనూ వారు కోరారు. కాని సోవియట్ రాజ్యం కమిసార్లు బ్యాంకులకూ, పరిశ్రమలకూ, జిల్లాసంస్థలకూ వెళ్ళి, అక్కడ పనిచేసే సామాన్య ప్రజల సహాయంతో, అట్టడుగునుండి నూతన సోవియట్ వ్యవస్థను నిర్మించారు.

కేంద్రంనుండి ఒక కొత్త శాసనం జారీ చేయబడకుండా, ఒక్క వారంకూడా గడవని రోజులవి. ఈ శాసనాలు ఆర్థిక నిర్వహణ సూత్రాన్నే సమూలంగా మార్చివేసేటటువంటివి, పెట్టుబడిదారుల చేతుల్లోనుండి శ్రామికవర్గరాజ్యానికి గొప్ప పారిశ్రామిక శాఖలను బదలాయింపు చేసేటటువంటివి. పెట్టుబడిదారులచే నడుపబడేటటువంటి పరిశ్రమలపైని కేవలం అజమాయిషీ చెలాయించడంనుండి, కార్మికులు ఫాక్టరీల, మిల్లుల జాతీయకరణకు సాగిపోయారు.

రాజ్య భవిష్యమే సంశయాస్పదంగావున్న పరిస్థితులలో, అభివృద్ధి నిరోధకులు రెచ్చగొట్టిన తిరుగుబాట్లు ఒకొక్కసారి ఒక ప్రాంతాన్నుండి, యింకోసారి మా గ్రామంనుండీ సోవియట్ రాజ్యాధికారాన్ని తొలగించివేసిన కాలంలో, నూతన కార్మిక కర్షకుల రాజ్యాన్ని కూలద్రొయ్యడానికి సామ్రాజ్యవాదులు రహస్యంగా కుట్రపన్నుతోన్న రోజుల్లో, యీ విధంగా, శ్రామికవర్గంనుంచి ఉద్భవించిన ప్రజలు నూతనమైన, అపూర్వమైన ప్రజారాజ్యాన్ని నిర్మించారు.

ఇటువంటి పరిస్థితుల్లో ఫాక్టరీలూ, పరిశ్రమలూ ప్రభుత్వపరం చేయబడ్డాయి, సోవియట్ రాజ్యం ఆర్థిక నిర్మాణ పథకాలను చేపట్టింది. మురికిపేటల్లో జీవించే బిడ్డలు గ్రామసీమలకు క్రమపద్ధతిలో తీసుకపోబడ్డారు. నిరక్షరాస్యతా నిర్మూలనకు సర్వతోముఖమైన కృషి ప్రారంభింపబడింది.

ఈ విధంగా, మానవజాతి మధుర స్వప్నమైన సామ్యవాదం, అట్టడుగునుండి అధిక సంఖ్యాకులైన కష్టజీవులచే నిర్మితమైన నూతన అపూర్వశక్తి, సోవియట్ ప్రజాస్వామిక శక్తి అయిన సోవియట్ రాజ్యంచే అమలు జరపబడిన యదార్థమైన, సుసాధ్యమైన విషయంగా రూపొందడం ప్రారంభమైంది.



న్మను పొందింది. పంచవర్ష ప్రణాళికల దశలో ఈ పర్వతశ్రేణి మహత్తర పారిశ్రామిక శక్తికి "వెన్నెముక" అయింది.

## నొవొ-త్రొయిత్స్క్

చువాష్ స్వయం పరిపాలనా రిపబ్లిక్ గుండానూ, అటు తరువాత తార్తార్ స్వయం పరిపాలనా రిపబ్లిక్ గుండానూ 1,500 కిలో

బెరెజ్నికి

పెర్మ్

నిజ్నిటాగిల్

గోర్కీ నుండి మా ప్రయాణం ప్రారంభించాం

స్వెర్డ్లోవ్స్క్

కజాన్

జ్లాటౌస్ట్

చెల్యాబిన్స్క్

అబ్దులినో

మాగ్నితొగోర్స్క్

ఛ్కాలోవ్

**ఈ** మధ్యనే మేము ఒక మోటారుకారులో ఉరల్స్ పర్వత ప్రాంతాల్లో పర్యటించాము.

ఉత్తరంనుండి దక్షిణానికి ఆర్కిటిక్ సముద్రం నుండి వేడి ప్రాంతమై కజకస్తాన్ వరకు రెండువేల కిలో మీటర్ల పొడవు విస్తరించి వున్న రాతి గోడయే ఉరల్స్ పర్వతాలు. ఆసియాకూ, యూరపుకూ మధ్య అది సహజమైన సరిహద్దుగా వుంటున్నది.



# ఉరల్స్ నుండి


ఐ. అగ్రనోవ్స్కీ, వి. పొల్యానిన్


సమాచార గ్రంథాల్లోనూ, మ్యాగజైన్లలోనూ, ఇతర సాహిత్యంలోనూ "ప్రాచీన ఉరల్స్" అన్న పదం మనకు తటస్థపడుతూ వుంటుంది. భూతలంమీద అతి ప్రాచీన పర్వతాల్లో ఉరల్స్ పర్వత శ్రేణి ఒకటి గాబట్టి దానికా పేరు వచ్చింది.

ఉరల్స్ ప్రాంతం 17వ, 18వ శతాబ్దాలలో ఉచ్చస్థితిలో వుంటుండేది. మాస్కో లోని జారుయొక్క ప్రతినిధులయిన డెమిదోవ్‌లు ఇక్కడ ఇనుప యంత్రాగారాలను అర్ధ బానిసల శ్రమశక్తితో నిర్మింపచేసి ఇనుము ఉత్పత్తి విషయంలో రష్యాకు ప్రపంచంలో ప్రథమ స్థానాన్ని సాధించారు. ఆ రోజుల్లో ఉరల్స్ ఇంగ్లండుకూ, అమెరికాకూ ఇనుమును సరఫరా చేస్తుండేది.

పందొమ్మిదవ శతాబ్దం మధ్య కాలానికల్లా ఉరల్స్‌యొక్క యీ పరిశ్రమ క్షీణించిపోసాగింది. బ్లాస్ట్ ఫర్నెస్‌లూ, పాత యంత్రాగారాలూ మూలపడ్డాయి. అక్టోబరు విప్లవానంతరం ఉరల్స్ పునర



బ్లాస్ట్‌ఫర్నెస్ →



దెమిదో కుటుంబీకులలో ఎడపటి వ్యక్తి మారియా

★

మెటర్లర్జీ విభాగం పయనించిన తర్వాత మేము చ్కలోవ్ మండలానికి, ఉరల్స్ ప్రాంతానికి చేరుకున్నాము. నొవా-త్రొయిత్స్క నగరాన్ని సమీపించే టప్పటికి మాకు ఉరల్స్ పర్వతాలు కనబడసాగాయి. ఈ పట్టణం ఇటీవలిదే. అందువల్ల పదిహేను సంవత్సరాల క్రితం తయారు చేయబడిన యే చిత్రపటంలోనూ అది మనకు కనబడదు.

నొవా-త్రొయిత్స్క నగరం ఓర్స్క-ఖలిలోవ్ యంత్రాగారం అనబడే ఒక పెద్ద ఇనుము, ఉక్కు యంత్రాగారానికి ప్రఖ్యాతి గాంచింది. మాతోపాటు కారులో వచ్చిన ఎరియా కవి, జెనియా జెల్వకోవా అనే యిద్దరు యువతులు ఆ గ్రామానికి ఆ పేరు ఎలా వచ్చిందో చెప్పారు. ఓర్స్క, ఖలిలోవ్‌లు అనే రెండు గ్రామాలకు మధ్య ఇనుపగనులు కనుగొనబడ్డాయట. అక్కడ ఒక యంత్రాగారం నిర్మింపబడ్డది. అందువల్ల ఆ ప్రాంతానికి రెండు గ్రామాల పేర్లు కలిపి పేరు పెట్టబడింది.

నొవా-త్రొయిత్స్కలోని ఇనుము, ఉక్కు యంత్రాగారానికి వెళ్ళి మేము సుకొరుకోవ్ అనే ఆ యంత్రాగారపు డైరెక్టరును కలిసికొన్నాము. యంత్రాగారాన్ని గురించి ఆయనతో మాట్లాడాము. క్రోమియమ్, నికల్ వున్న ముడి యినుమును ఆ యంత్రాగారం ఉపయోగిస్తున్నదని డైరెక్టరు సుకొరుకోవ్ తెలియజేశారు. ఇటువంటి ముడి ఇనుమునుండి అతిశ్రేష్ఠమయిన ఇనుము, ఉక్కు తయారవుతాయట. కాని అలాంటి ముడి ఇనుమునుండి ఇనుమును, ఉక్కును ఉత్పత్తి చేయడంకూడా చాలా కష్టమైన పనేనట.

"ఇక్కడ బ్లాస్ట్ ఫర్నేస్‌లు ఇనుమును ఉత్పత్తి చేయజాలవు అన్నారు కొందరు. కాని మేము చిక్కని ఇనుమును ఉత్పత్తి చేస్తున్నాము," అన్నారు సుకొరుకోవ్, టేబుల్‌మీద వున్న ఒక లోహపు ఫలకాన్ని చూపిస్తూ. "1955 మార్చి 5. ఓర్స్క-ఖలిలోవ్ యంత్రాగారంలో ఉత్పత్తి చేయబడిన మొట్టమొదటి దుక్కు యినుము ఫలకం," అని దానిమీద వ్రాసి వున్నది.

## "భిలాయ్ సోదరుడు"

సుకొరుకోవ్ ఇంకా మాట్లాడుతూ, భారతదేశంలో భిలాయ్‌లో నిర్మింపబడుతున్న ఇనుము, ఉక్కు యంత్రాగారం కూడా క్రోమియం, నికల్ వున్న ముడి ఇనుమునే ఉపయోగిస్తుంది గాబట్టి దానిని మా యంత్రాగారపు "సోదరుడ"ని పిలవవచ్చునని అన్నారు. ఈ ముడి ఇనుమును ఉపయోగించుకొనడంలో గడించిన అనుభవాలు భారత దేశానికి తెలియజేయబడతాయి.

"భారత దేశం భిలాయ్‌లో శ్రేష్ఠమైన ఇనుమును, ఉక్కును ఉత్పత్తి చేస్తుంద"ని సుకొరుకోవ్ అన్నారు.

సుకొరుకోవ్ మాకు యంత్రాగారాన్ని చూపించారు. కోక్-ఎండ్-కెమికల్ షాపులో ఆయన మాకు సెమ్యన్ ప్రిత్స్కర్ అనే ఒక ఇంజినీరును పరిచయం చేశారు. భారత దేశంలో ప్రకటింపబడుతున్న "సోవియట్ భూమి" అనే ఒక పత్రికకు మేము విలేఖరులమని తెలిసినప్పుడు, ఆయన భిలాయ్‌కి తమ యంత్రాగారం ఒక బహుమతిని పంపబోతున్నదని పత్రికా పాఠకులకు తెలియజేయమని కోరారు.

"పూర్వం అన్ని కోక్-ఎండ్-కెమికల్ యంత్రాగారాలలోనూ బొగ్గు, పారల సహాయంతో చేతితోనే వేయబడుతుంది" అంటూ ప్రిత్స్కర్ చెప్ప నారంభించారు. అది చాలా కష్టతరమైన పని. అంతేగాక రోజల్లా వేడిలోనూ, దుమ్ములోనూ పడివుండవలసి వస్తుంది. ఈ పనిచేసే కార్మికులు యెప్పటికప్పుడు చన్నీటిలో స్నానం చేయవలసివస్తూ వుంటుంది. ఇక్కడికంటే వేడి ఎక్కువగా ఉండే భారత దేశంలో యీ పని యింకా ప్రయాసతోకూడి వుంటుందని మేము గ్రహించాము. అందువల్ల దూరంనుంచే కంట్రోలు చేయడానికి వీలుండే మెకనైజ్డ్ లోడింగ్ కారును భిలాయ్ కొరకు తయారుచేయడానికి నిర్ణయించాము. ఓమ్స్కలోని "ఉజురల్మాస్క"అనే యంత్రాగారం సహాయం మేము యీ మెకనైజ్డు లోడింగ్ కారును తయారుచేస్తున్నాము.

మేము ఓమ్స్క యంత్రాగారానికి వెళ్ళి అక్కడి చీఫ్ ఇంజినీరు ఇవాన్ దోబ్రోస్కోవ్‌ను కలసికొన్నాము. ఆయన భారత దేశానికి వెళ్ళి ఉష్ణప్రాంతాల్లో యంత్రాలు ఎలా పనిచేస్తాయో పరిశీలించివచ్చారు. బ్రహ్మాండమైన ఆ యంత్రాగారాన్నంతటినీ ఆయన మాకు చూపించారు. అది ఫాసిజానికి వ్యతిరేకంగా జరిగిన యుద్ధ



★

అలెగ్జాండర్ సుఖొరుకోవ్, కుమారుడు యూరా, మేనల్లుడు ఆర్థాష్కారో.

★

కాలంలో ఓర్స్క అనే ఒక చిన్న పట్టణంలో ప్రారంభింపబడి యిప్పటి స్థితికి రూపొందింది. భిలాయ్‌కి అవసరమైన యంత్రాలను అదే తయారు చేస్తున్నది. అదిప్పుడు భిలాయ్ కొరకు బొగ్గు అన్‌లోడర్లను, కోక్ ఓవెన్‌లకు అవసరమైన యంత్రాలను, రోలింగ్ మిల్లుయూనిట్లను సిద్ధం చేస్తున్నది.

## సోవియట్ లోహ పరిశ్రమ రాజధాని

మార్గమధ్యంలో మాకు "మాగ్నితోగోర్స్కకు 60 కిలోమీటర్ల దూరం"అన్న బోర్డు కనబడ్డది. అక్కడి నుండి దిఙ్మండలంలో పొగ కనబడసాగింది. అదే మాగ్నితొగోర్స్క.

ప్రథమ సోవియట్ పంచవర్ష ప్రణాళికా కాలంలో జరిగిన బ్రహ్మాండమైన నిర్మాణాల్లో మాగ్నితోగోర్స్క ఒకటి. మాగ్నితోగోర్స్క నిర్మింపబడేవరకు సోవియట్ దేశంలో దక్షిణాన, సోవియట్ దేశపు యూరోపియన్ ప్రాంతంలో ఇనుము, ఉక్కు యంత్రాగారం ఒక్కటి మాత్రమే ఉండేది. తూర్పు దిశలో, అనగా సోవియట్ దేశం ఆసియా ప్రాంతంలో, ఇప్పుడు మాగ్నితోగోర్స్క నగరం ఉన్నచోట రెండవ ఇనుము, ఉక్కు ఉత్పత్తి కేంద్రం 1929లో ప్రారంభింపబడింది.

అంతకు పూర్వమే మాగ్నితోగోర్స్కను గురించెంతో చదివి, విని ఉన్న మేము ఆ పట్టణంలో ప్రవేశించే సమయానికి వెనుకనుండి మబ్బులు క్రమ్ముకొనిరాసాగాయి, అందువల్ల నగరం యొక్క ఛాయాచిత్రాలను వెంటనే తీసుకొనడానికి నిశ్చయించుకొన్నాము.



ఓర్స్క్-ఖలిలోవ్ కర్మాగారపు బ్లాస్టుఫర్నెస్



ఫెయొదొర్ తొల్కచోవ్, ఓర్స్క్-ఖలిలోవ్ కర్మాగారపు సీనియర్ ఫోర్మన్



భిలాయ్ కర్మాగారానికి యంత్ర నిర్మాణంచేస్తోన్న దక్షిణ ఉరల్స్ ఇంజనీరింగ్ ప్లాంటుయొక్క అసెంబ్లీ షాపు దృశ్యం



మాగ్నితొగొర్స్క్‌లోని ఒక వీధిదృశ్యం

ఛాయాచిత్రాలు తీయడానికి మేము ఎనిమిది అంతస్థుల ఒక మేడ మీదికి యెక్కాము. అక్కడ యాదృచ్ఛికంగా మాకు ఫెయొదర్ స్మోల్నికోవ్ అనేఒక బ్లాస్ట్‌ఫర్నెస్ ఫోర్మెన్‌తో పరిచయంయేర్పడింది.

స్మోల్నికోవ్ మాకు మాగ్నితోగోర్స్క్‌లో ముఖ్యమైన ప్రాంతాలేవేవో తెలియజేశాడు. భవనంపైనుండి చూస్తుంటే ఆ దృశ్యం అతి మనోహరంగా ఉన్నది. నగరం మధ్యగా ఉరల్స్ నది ప్రవహిస్తుంది. ఆనకట్టకు యెగువను నది చాలా వెడల్పుగా వున్నది. ముడి ఇనుము సమృద్ధిగా ఉన్న ప్రఖ్యాత మాగ్నిత్నియా పర్వతం ఆ నది ఎడమ తీరంలో ఉన్నది. దాని ప్రక్కనే యంత్రాగారం ఉన్నది.

మాగ్నితోగోర్స్క్ నగరం ఎడమతీరంలోనే నిర్మింపబడింది. కాని ఇప్పుడు, యంత్రాగారపు పొగకు దూరంగా ఉండాలన్న ఉద్దేశ్యంతో నివాసగృహాలు కుడితీరంలో నిర్మింపబడుతున్నాయి.

"ప్రథమ పంచవర్ష ప్రణాళికాకాలపు సంవత్సరాలలో మేము యీ పొగనుగురించి అంతగా పట్టించుకోలేదు." అంటూ స్మోల్నికోవ్ చెప్ప నారంభించాడు. "దేశానికి అత్యవసరమయిన లోహాన్ని తయారు చేయడానికి మిల్లును నిర్మించాలన్న ఒకేఒక విషయంపైన అప్పుడు మా దృష్టి కేంద్రీకృతమయి ఉంటూ వచ్చింది. అప్పుడు జీవన పరిస్థితులు కష్టతరంగా ఉంటుండేవి, తీవ్రంగా మంచుపడుతూ వుండిన నడిశీతాకాలంలో గూడా ప్రజలు డేరాల్లో కాలం వెళ్ళబుచ్చుతుండేవారు."

అయినప్పటికి, ఈ ప్రఖ్యాత నిర్మాణంలో పాల్గొనడానికి అత్యుత్సాహంతో వేలకొలది యువక వాలంటీర్లు వస్తుండేవారు. అసలు, మొదటి పథకం ప్రకారం అమెరికాకు చెందిన మేక్కీ కంపెనీవారు యంత్రాగారాన్ని డిజైను చేయవలసింది. కాని సమయం చాలదన్న నెపంతో ఆ కంపెనీ కంట్రాక్టును రద్దు చేసుకొన్నది. "ఈ యంత్రాగారాన్ని మీరెప్పటికీ కట్టలేరు." అన్నారు ఆ కంపెనీవాళ్ళు వెళ్ళిపోతూ. "ఈ కార్యక్రమం అసాధ్యమయినది. కాని మాగ్నితోగోర్స్క్ యంత్రాగారం నిర్మింపబడ్డది. మరొక ముఖ్యమైన విషయమేమిటంటే అది అనుకున్నదానికంటే ముందుగానే పూర్తయింది.

ఈ యంత్రాగారపు డైరెక్టర్ ఫియోదోసి వొరొనోవ్, అక్కడ యెంత ఉత్పత్తి జరుగుతున్నదీ, ఆ యంత్రాగారం యే విధంగా ప్రఖ్యాతిగాంచినదీ తెలియజేశారు. ఆయన ఉత్పత్తికి సంబంధించిన సంఖ్యా వివరాలను తెలియజేశారు. వాటిని మేము మా నోటు పుస్తకాల్లో వ్రాసుకొంటూ దాదాపు ప్రతిసంఖ్య ప్రక్కన ఆశ్చర్యార్థక సూచకాన్ని పెట్టాము. నేడు మాగ్నితోగోర్స్క్ విప్లవానికి పూర్వం యావత్తు రష్యా ఉత్పత్తిచేస్తూ వుండిన మొత్తాన్ని, బ్రిటిష్ ఉక్కు పరిశ్రమ మొత్తం ఉత్పత్తిచేసే దానిలో మూడవవంతును తయారు చేస్తున్నది. మాస్కో, లెనిన్‌గ్రాడ్ నగరాలు మొత్తంగా వినియోగించేదానికంటే యెక్కువ నీటిని వినియోగిస్తున్నది. యంత్రాగారం లోపల వున్న రైల్వేలైను పొడవు మొత్తం హాలెండ్ దేశంలో వున్న రైల్వేలైనుకు మించి వున్నవి. దేశంలోని 'అడవి-పెంపకపు' నగ

రాళ్లో మాగ్నితోగోర్స్క్ ఒకటి. దాని జనాభా 300,000. ఏటేటా 15,000 జనాభా పెరుగుతున్నది.

యంత్రాగారం యొక్క బ్లాస్ట్ ఫర్నేస్, ఉత్పాదక శక్తికి సంబంధించిన సంఖ్యా వివరాలను ఆయన ఎంతో గర్వంగా మాకు తెలియజేశారు. వాటి ఉత్పాదక శక్తికి మించినది ప్రపంచంలో మరెక్కడా లేదు. మాగ్నితోగోర్స్క్‌లోని ఒక్కొక్క బ్లాస్ట్ ఫర్నేస్, అమెరికాలో ఉపయోగింపబడే అదే ప్రమాణపు బ్లాస్ట్ ఫర్నేస్‌కంటే 50 శాతం ఎక్కువ దుక్క యినుము ఉత్పత్తిని తయారు చేస్తుంది. మాగ్నితోగోర్స్క్‌లోని లోహ యంత్రాగారం యూరపులోని లోహ యంత్రాగారాలన్నిటిలోకీ పెద్దది. కొద్ది సంవత్సరాల లోపల దాని ఉత్పాదక శక్తి యింకా పెరగబోతున్నది. అప్పుడది ప్రపంచంలోకంతటికీ పెద్ద లోహ యంత్రాగార మవుతుంది.

రెండు సంవత్సరాల క్రితం భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ మాగ్నితోగోర్స్క్ నగరాన్ని సందర్శించినప్పుడు, ఆ నగరం కొత్తగా లేచినదే అయినప్పటికి "అప్పుడే ప్రపంచప్రఖ్యాతిని గాంచినది"ని అన్నారని యంత్రాగారం డైరెక్టర్ చెప్పారు.

సోవియట్ లోహ పరిశ్రమకు రాజధాని అన్న నామాన్ని సార్థకం చేసుకొంటున్న ఆ నగరాన్ని వీడి మేము ముందుకు కదిలాము.

*



కరిగించిన ఉక్కు దిమ్మలలో పోతబోస్తున్న దృశ్యం



ఫెయొదొర్ స్మొల్నికొవ్, మాగ్నితొగొర్స్క్‌లో ఇంటి కప్పుమీదనుంచి మాకో దృశ్యాన్ని చూపించారు

## ఉప్పుచేసే ఉపకారం

* ల్యూసాన్ ఆకునుగానీ, తాజా కూరగాయలగానీ ఉప్పునీళ్ళ బేసిన్‌లో వేసి కొద్ది నిముషాలుంచితే క్రిములన్నీ పోతాయి.
* వెన్న, ఉప్పునీళ్ళలో తడిపిన పరిశుభ్రమైన గుడ్డలో చుట్టిపెడితే ఉష్ణోగ్రత అత్యధికంగా వున్న రోజునకూడా కరగకుండా పెట్టినది పెట్టినట్టు వుంటుంది.
* చేపలను ఉప్పునీటిలో కుదిలించి కడిగినట్టయితే "చేపల వాసన" పోతుంది. చేపలను పరిశుభ్రపరిచేటప్పుడు నీ వ్రేళ్ళను ఉప్పు నీటిలో ముంచినట్టయితే—అది నీకు మంచిపట్టు నిస్తుంది.

# ఇల్మెన్ రక్షిత మండలం

లక్షలాది ఏళ్ళక్రితం ప్రకృతి సృష్టించినది సృష్టించినట్టుగానే యింకా వున్న ఉరల్స్‌లోని ఒక భాగానికి మేము, మాగ్నిటో గోర్స్క్ నుండి బయలుదేరాము.

మేము ఉత్తర దిశకు వెళ్లుతూవుంటే. ఉరల్స్ తమకు వచ్చిన కీర్తిని సమర్థించుకోవడం మొదలు పెట్టాయి. రోడ్డుమీదికి పోతూ వుంటే, తమ పేరుకు అర్హత సంపాదించుకున్న పర్వతాలు మా చుట్టూరా మూగి వున్నాయి, వాటి శిఖరాలు మబ్బులను అంటుతూ వుంటే. వాటి లోయల్లో, శతాబ్దాల వయస్సుగల పైన్ చెట్లు పెరిగాయి. రాళ్ళ మధ్యను సరస్సులు వజ్ర వైడూర్యాలలాగ మెరుస్తున్నాయి. మేము ప్రఖ్యాతమైన ఇల్మెన్ రక్షితప్రాంతంలో వున్నాము.

ఉరల్స్ పర్వతశ్రేణిలోని ఒక కొండ పేరు, ఇల్మెన్. ఈ కొండ ఉరల్స్‌లోని అద్భుతాలలో ఒకటి. ప్రఖ్యాత సోవియట్ భూగర్భ శాస్త్రజ్ఞుడు అకెడిమీషియన్ ఫెర్సమన్, ఇల్మెన్ కొండకు "ఖనిజ శాస్త్ర స్వర్గం" అని పేరు పెట్టారు, మూడు వందల చదరపు కిలోమీటర్లు మాత్రమే గల యీ చిన్న భూఖండంలో రెండు వందలకు పైగా ఖనిజాలు కనుగొనబడడం వల్ల. ప్రపంచంలో యింకెక్కడా లేని ఖనిజాలుకూడా వీటిలో కొన్ని వున్నాయి. ఇవిగాక వజ్రాలు, మాణిక్యాలు, పుష్పరాగాలూ, ఇంద్రనీలాలూ వున్నాయి. ప్రపంచ భూగర్భశాస్త్ర మహాసభ సభ్యులు ఇల్మెన్ కొండల సంపదలను పరిశీలించడానికి 1897 లోనూ, 1937 లోనూ వచ్చారు.



ప్రొఫెసర్ ఎన్. తిమొఫెయేవ్-గెసొవ్‌స్కీ,
ప్రొఫెసర్ ఎ. ల్యపునొవ్



ఇల్మెన్ సరస్సు ఒడ్డుమీదుగా పదయాత్రికులు పోతున్న దృశ్యం

★

ఇరవైయ్యవ శతాబ్దారంభంలో, యీ ప్రాంతపు అపూర్వ కథలలో వుండేటటువంటి సంపదల దోపిడీ మొదలైంది. బంగారం కోసమూ, విలువైన రాళ్ళకోసమూ ఇల్మెన్‌కు వచ్చి, యీ ప్రకృతి నిధినుండి నిర్దాక్షిణ్యంగా సంపదలను కొల్ల గొట్టేవారు. అక్టోబరు విప్లవమొక్కటే దీనిని కాపాడింది. 1920 మార్చిలో, ఇల్మెన్ కొండలను రక్షిత ప్రాంతంగా ప్రకటిస్తూ లెనిన్ ఒక శాసనాన్ని జారీ చేశారు. ప్రపంచంలోకల్లా యిది మొదటి ఖనిజ రక్షిత ప్రాంతం. నిక్షిప్త సంపదల వైజ్ఞానికాన్వేషణ ఒక్కటి మాత్రమే యిక్కడ అనుమతింపబడుతుంది. ఇది తప్ప యీ ప్రాంతం, దానిని ప్రకృతి సృష్టించినట్టుగా అట్టె పెట్టబడింది. "పరిపూర్ణ శాంతి మండలం"—అని వుంది, యీ రక్షిత ప్రాంతంలోని బోర్డులమీద. అక్కడ నిజమైన పరిపూర్ణ శాంతి వుంది.

ఇక్కడికి సాలుకు సుమారు ముప్పయి వేలమంది యాత్రికులు వస్తుంటారు. కాని వారికి కొసలు మాత్రమే చూపబడుతూ వుంటాయి. లోపల అంతా శాంతిమయం. ఈ రక్షిత ప్రాంతం లోతులలోనికి వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు మాత్రమే పోతారు. ఇక్కడ పనిచేసేవారు భూగర్భ శాస్త్రజ్ఞులు మాత్రమేకారు. దీనికి మధ్యను, మియసోవో సరస్సు ఒడ్డున, జీవశాస్త్రజ్ఞుల చిన్న నగరాన్ని ఒకదానిని మేము చూశాము.



ప్రసిద్ధ రష్యన్ లోహనిపుణుడు అనొసోవ్ స్మారక చిహ్నం

★

రక్షిత ప్రాంతానికి కాస్త అవతల మాకు రెండు యాత్రిక శిబిరాలు కనిపించాయి. ఈ రెండూ అందమైన ఇల్మెన్ సరస్సు ఒడ్డున వున్నాయి. వేసవిలో యిరవై వేల మందికి పైగా ప్రజలు యిక్కడ సెలవలు గడుపుతారు.

రక్షిత ప్రాంతపు పొలిమేరల్లోని మియస్స్, జ్లతౌస్ట్ అనే రెండు నగరాలకు మేము వెళ్ళాము. మియస్స్ ఒకప్పుడు ఉరల్స్‌కు "బంగారు ముఖ్య నగరం"గా వుండేది. కాని యిప్పుడు ముఖ్యంగా బంగారు గనుల త్రవ్వకం సైబీరియాకూ, ఉత్తరాదికీ బదిలీ అయ్యింది; మియస్స్, ఉరల్స్‌కు "మోటారు కార్ల ముఖ్యపట్టణం"గా మార్చివెయ్యబడింది. యుద్ధకాలంలో మియస్స్‌కు మార్చబడిన మాస్కో మోటారు కారు పరిశ్రమ యిక్కడొక పరిశ్రమను నిర్మించింది. ఇది మొదటి పరిశ్రమ మాస్కోకు తిరిగి వెళ్ళాకకూడా యిక్కడనే ఉండిపోయింది. స్థానిక ప్రజలు గొప్పగా ప్రశంసించే ట్రక్కులను మియాస్స్ ఫాక్టరీ తయారు చేస్తోంది. అవి దృఢంగా వుంటూ, సులభంగా కొండరోడ్లపైని పోగలుగుతాయి గాబట్టి, యిది వారి ప్రశంసలను అందుకొంది. ఫాక్టరీకి చెందిన 30 ఏళ్ళ ప్రాయపు ప్రధాన డిజైనర్ స్వతొస్లావ్ కురోవ్ డిజైన్ చేసిన రెండు కొత్త నమూనాలు మాకు చూపబడ్డాయి.

ఈ చిన్న నగరానికికూడా భారత దేశంతో సంబంధాలుండడం మాకు అవగతమైంది. మియస్స్ కట్లరీ ఫాక్టరీ ఫౌండ్రీ అధిపతి నికొలాయ్ మలెయేవ్ రెండేళ్ళ క్రితం కలకత్తాకు వెళ్ళి, శ్రీ లోహాతీకి చెందిన హిందూస్తాన్ కంపెనీయొక్క కట్లరీ ఫాక్టరీలో సోవియట్ యంత్రాలను నెలకొల్పారు. ఈ ఫాక్టరీయొక్క ఉద్దేశింపబడిన కెపేసిటీ. రోజుకు 15 వేల రంపాలు.

మియస్స్ నుండి మేము జ్లతౌస్ట్‌కు వెళ్ళాము. ఇది ఉరల్స్‌లోని అతి పాత లోహ కేంద్రాలలో ఒకటి. ముఖ్య చౌకులో, అర్ధచంద్రాకారంగా తాను వంచివేసిన కత్తిని దీక్షగా పరిశీలిస్తోన్న ఒక మనిషి విగ్రహాన్ని మేము చూశాము. ఆయన ప్రక్కను ఒక సూక్ష్మవస్తుదర్శిని వుంది. ఆ విగ్రహంపైని యిలా వ్రాసివుంది: "రష్యన్ లోహ శాస్త్ర విశారదుడు పి. ఏ. అనొసోవ్‌కు, 1797-1851."

అనొసోవ్ ఒకప్పుడు జ్లతౌస్ట్ లోహ పరిశ్రమాధిపతిగా ఉండేవారు. లోహశాస్త్రంలో మొట్టమొదట సూక్ష్మవస్తు దర్శినిని యీయనే ప్రపంచానికల్లా తొలిసారిగా వాడుకచేశారు. ఈ విధంగా ఆయన మెటల్లోగ్రాఫీ అనే కొత్త శాస్త్రానికి పునాదులు వేశారు. బెస్సెమెర్‌కు ముందర ఆయన ఇన్‌గాట్ ఉక్కును తయారుచేసే పద్ధతిని కనుగొన్నారు. తరవాత, భారత దేశానికీ, అరేబియాకూ చెందిన ప్రాచీన దామస్క్ వుక్కు వస్తువులను తయారుచేసే రహస్యాన్ని ఆయన కనుగొన్నారు. ఇది అంతకు ముందర కాలగర్భాన కలిసిపోయిన విషయం. రెండేళ్ళక్రితం జ్లతౌస్ట్‌లో అనొసోవ్ స్మృతికి చిహ్నంగా నెలకొల్పబడిన విగ్రంలో, రష్యన్ దమస్క్ ఉక్కుతో తయారు చేయబడిన కత్తిని పరీక్షిస్తున్నట్టుగా చూపబడింది.

జ్లతౌస్ట్ నగరం తన ఇంజినీరింగ్ పాఠశాలలో ఉత్తమ విద్యార్థులకు అనొసోవ్ విద్యార్థి వేతనాలను నెలకొల్పి, తన ప్రఖ్యాత పౌరుని స్మృతిని గౌరవించింది. జ్లతౌస్ట్ సంస్కృతీ భవనంలో అమెచ్యూర్ ప్రదర్శనాల బృందం, దనిలెంకో అన్న స్థానిక ఇంజినీరు వ్రాసిన "రష్యన్ దమస్క్ ఉక్కు" అన్న ఒక నాటకాన్ని ప్రదర్శిస్తోంది.

అయినా, నేటి జ్లతౌస్ట్ ఉక్కు నిర్మాణంతో తనకు గల ప్రావీణ్యంతో సంతృప్తిపడి ఊరుకోవడంలేదు. అక్కడి ఊహ పరిశ్రమ ప్రధాన ఇంజినీరు అలెక్సీ పెత్రోవ్, యీ పరిశ్రమ 350 రకాల వుక్కును తయారు చేస్తోంది గాబట్టి, అది దేశపు పెద్ద "ఉక్కు అంగడి"గా పేరుపడిందని మాకు చెప్పారు. అక్కడ ఎటువంటి విలువైన రకాల ఉక్కు వుందంటే, కావలిసినవారికది కొద్దికొద్దిగా తపాలాద్వారా పంపబడుతోంది. ఈ రకాలు ఎక్కువ వేగంగల కట్టర్లను, డెంటల్ డ్రిల్లులనూ, గడియారం భాగాలూ మొదలైన వాటినీ తయారు చేయడానికి ఉపయోగింపబడుతున్నాయి. ఈ పరిశ్రమ ఎంతగా విస్తృతం గావింపబడిందంటే, తొందర్లోనే దాని వస్తువుల ధరలు మాగ్నితోగోర్స్క్‌లో తయారు చేయబడే వస్తువుల ధరలతో యించుమించు సమానంగా వుంటాయి. (సశేషం)

# అమెరికన్ "యునైటెడ్ ప్రెస్" ఏజెన్సీ విలేఖరి హెన్రీ షపిరోతో, ఎన్. ఎస్. కృశ్చేవ్ ఇంటర్వ్యూ

అమెరికన్ "యునైటెడ్ ప్రెస్" ఏజన్సీయొక్క మాస్కోలోని ప్రధాన విలేఖరి హెన్రీ షపిరో సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి ఎన్. ఎస్. కృశ్చేవ్‌ను తనకు ఇంటర్‌వ్యూకు అవకాశం కల్పించమని కోరారు.

నవంబరు 14వ తేదీన ఎన్. ఎస్. కృశ్చేవ్ హెచ్. షపిరోను కలసికొని సంభాషించారు.

ఆ విలేఖరి, సోవియట్ దేశంలో సమీపభవిష్యత్తులో, సోవియట్ దేశ రాజకీయ, ప్రభుత్వ నిర్మాణాలలోనూ, సంస్కృతీ రంగంలోనూ అభివృద్ధికిగల అవకాశాలను తెలియజేయమని ఎన్. ఎస్. కృశ్చేవ్‌ను అడిగారు. దానికి సమాధానమిస్తూ, ఎన్. ఎస్. కృశ్చేవ్, సోవియట్ దేశ ఆర్థిక విధానం విజయవంతంగా అభివృద్ధిని పొందుతున్నదన్నారు. పారిశ్రామిక రంగంలోనూ, వ్యవసాయంలోనూ ముఖ్యమైన విజయాలు సాధింపబడ్డాయి. ఈ సంవత్సరం, పారిశ్రామిక, వ్యవసాయిక నిర్వహణా విధానంలో గావింపబడిన పునర్నిర్మాణమూ, యూనియన్ రిపబ్లిక్‌లకూ, స్థానిక సంస్థలకూ ఇవ్వబడిన విస్తృతాధికారాలూ మాకు ఉన్న గొప్ప మూలాధారాలను సంపూర్ణంగానూ, సక్రమంగానూ వినియోగించుకో దానికి దోహదమిస్తాయని ఎన్. ఎస్. కృశ్చేవ్ అన్నారు. కార్మికుల శ్రామిక ఉత్పాదనా శక్తిని పెంపొంద జేయడానికీ, ఉత్పత్తి ఖర్చులను తగ్గేట్టు చేయడానికీ మంచి పరిస్థితులు కల్పింపబడుతున్నాయి. ఈ విధంగా ఉత్పత్తి అధికమవుతుంది. ఇది, పరిశ్రమల్లోని అన్ని శాఖల అభివృద్ధికీ, గృహనిర్మాణాభివృద్ధికీ, సంస్కృతి అభివృద్ధికీ, తదితర సౌకర్యాలకూ యెక్కువ మొత్తాలను కేటాయించడానికి, ఇప్పుడు వెంటనే కార్మికవర్గం యొక్క వేతనాలను పెంచడానికీ దోహదమిస్తుంది.

హెచ్. షపిరో, క్రమక్రమంగా రాజ్యాంగ యంత్రంయొక్క ఆవశ్యకత అంతరించిపోతుందన్న సిద్ధాంతాన్ని ప్రశ్నించగా ఎన్. ఎస్. కృశ్చేవ్ ఇలా సమాధానమిచ్చారు :

"'రాజ్యాంగయంత్రం, విప్లవం' అన్న మహోగ్రంథంలో వి. ఐ. లెనిన్ రాజ్యాంగయంత్రంపై వివరించిన మార్క్సిస్టు–లెనినిస్టు ప్రబోధాల ననుసరించి మేము నడుచుకొంటాము. నిర్బంధపు ప్రభుత్వ సంస్థలు రాజ్యాంగయంత్రంవలెనే క్రమక్రమంగా, చిట్ట చివరికి, అంతరించిపోయాయనీ, అంతరించిపోకతప్పదనీ మేము ఇంతవరకూ అంటూ వచ్చాము, ఇకముందుగూడా అలానే అంటాము. ఎందువల్లనంటే అంత్యంలో రాజ్యాంగయంత్రమే మొత్తంగా అంతరించిపోతుంది. కాని యిది మాత్రం హఠాత్తుగా జరుగదు. క్రమక్రమంగా, కమ్యూనిస్టు సమాజాభివృద్ధిలో ఒకానొక దశలో జరుగుతుంది. ఇప్పుడేగనుక రాజ్యాంగయంత్రానికి సంబంధించిన సంస్థలను బలహీనపర్చి, ఇదివరకే నేను చెప్పినట్లు, బయటి నుండి శత్రువులు జరిపే కుతంత్రాలను ఎదుర్కొనడానికి ప్రధానంగా ఉపయోగపడుతున్న ప్రభుత్వ నిర్బంధ సంస్థలను రద్దు గావించడము గొప్ప పొరపాటూ, వామపక్షపు పెడదారి అవుతుంది." అంతర్జాతీయ పరిస్థితులు తొందరగా అభ్యుదయమార్గాన పడినట్లయితే, బయటినుండి దాడి జరిగే ప్రమాదం అంతరించి తూరామయిపోతుందని ఎన్. ఎస్. కృశ్చేవ్ అన్నారు. అనగా సాయుధసైన్యాలు తగ్గుతాయి, సోవియట్ రాజ్యాంగయంత్రపు సంస్థలు తగ్గిపోయి, మార్పులు వస్తాయి.

సోవియట్ దేశ సుప్రీమ్ సోవియట్ సమావేశంలో తెలుపబడినట్లు, సోవియట్ దేశం వచ్చే పదిహేను సంవత్సరాల లోపల ఉత్పత్తి విషయంలో అమెరికాను అధిగమించినట్లయితే దాని ఉద్దేశ్యం, ఆ కాలపరిమితి తర్వాత సోవియట్ దేశ ప్రజల జీవన ప్రమాణం, అమెరికా ప్రజల జీవన ప్రమాణ స్థాయికి వస్తుందనా అని షపిరో ఎన్. ఎస్. కృశ్చేవ్‌ను అడిగారు. ఈ ప్రశ్నకు సమాధానమిస్తూ ఎన్. ఎస్. కృశ్చేవ్, ఆహారవస్తువుల ఉత్పత్తి విషయంలో సోవియట్ దేశం ఇంకా త్వరలోనే అమెరికాను అధిగమించగలదని అన్నారు. ప్రస్తుతం, సోవియట్ ప్రజలకు అవసరమైన రొట్టె, కూరగాయలు సంపూర్ణంగా లభ్యమవుతున్నాయి. వచ్చే కొద్ది సంవత్సరాల్లోపల సోవియట్ ప్రజలకు అవసరమయిన మాంసం, వెన్న, పాలు ఉత్పత్తి చేయడానికి సాధ్యమైనంతా చేయబడుతున్నదని కృశ్చేవ్ చెప్పారు. ప్రజలకు అవసరమయిన గృహవసతిని 10–12 సంవత్సరాల లోపల కల్పించడానికి ఉద్దేశింపబడింది. మొత్తంమీద, గృహవసతి కొరతను అంతరింపజేసి, నగరాలలోనూ, గ్రామాలలోనూ ఉన్న ప్రజల అవసరాలను తీర్చ దానికి సాధ్యమైనదంతా చేయబడుతున్నది. గ్రామాల్లో యీ విషయాన్ని సాధించడం ఇంకా తొందరలోనే పూర్తికావచ్చును.

విద్యారంగంలో పరిస్థితులెలాగున్నాయని షపిరో అడిగిన ప్రశ్నకు సమాధానమిస్తూ ఎన్. ఎస్. కృశ్చేవ్, నిపుణులకు శిక్షణ నివ్వడం విషయంలో సోవియట్ దేశం ప్రథమ స్థానాన్ని ఆక్రమి

స్తున్నది, భవిష్యత్తులో యీ శిక్షణ ఇంకా అభివృద్ధికి తీసుకొని రాబడి, పరిపూర్ణత సాధింపబడుతుంది అని అన్నారు.

కోమింటర్న్ లేదా కోమిన్‌ఫార్మ్‌లాంటి అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ యేదైనా స్థాపింపబడే అవకాశాలు ఉన్నాయా అని కూడా హెచ్. షపిరో అడిగారు. అక్టోబరు విప్లవ వార్షికోత్సవం సందర్భంలో, విదేశ కమ్యూనిస్టు పార్టీల నాయకులు మాస్కోకు రావడంవల్ల ఇలాంటి సంస్థ స్థాపింపబడవచ్చునన్న ఊహాగానాలు చేయబడుతున్నాయి. ఈ ప్రశ్నకు సమాధానమిస్తూ కృశ్చేవ్, కమ్యూనిస్టు, కార్మిక పార్టీలు యిప్పుడు బాగా బలపడ్డాయనీ, కమ్యూనిస్టు ఉద్యమాన్ని నడుపడానికి యేలాంటి కేంద్రమూ అవసరం లేదనీ అన్నారు. ఇక కమ్యూనిస్టు ఉద్యమ నాయకుల మధ్య అప్పుడప్పుడు జరుగవలసిన సమావేశాల విషయం. అటువంటి రూపాలను మేము కాదనడంలేదు. అవి చాలా వుపయోగకరంగా వుంటాయి. ఎందుకు, ఆ మాటకొస్తే, ఉత్తర అట్లాంటిక్ కూటమి దేశాలు అప్పుడప్పుడు సమావేశమవుతూండలేదూ? నిజానికి "నాటో" కూడా, కొంతవరకు ఒక రాజకీయ సంస్థే. అది సైనిక పథకాలతోపాటు, కార్మికోద్యమాలు, జాతీయ విముక్తి ఉద్యమాలకు వ్యతిరేకంగా పోరాటాన్ని జరుపడానికిగూడా పథకాలను తయారు చేస్తుంది.... ఐక్యతను పొందడానికీ, తమ సంస్థలను స్థాపించుకోడానికీ తమకే హక్కు వున్నదని బూర్జువా వర్గం భావిస్తున్నది. కాని, కార్మికవర్గం తమ సంస్థలను స్థాపించుకొన్నా, కమ్యూనిస్టు, కార్మికపార్టీలు యేవైనా మహాసభలకు తమ ప్రతినిధులను పంపినా అది కుట్రదారులు ఒకచోట చేరడమవుతుంది. కాదు, మహాశయులారా, అలా సమావేశమవుతున్నది బలమైన కమ్యూనిస్టు ఉద్యమనాయకులు. మా శక్తుల ఐక్యతకొరకు మేము గట్టిగా నిలబడుతామని ఎన్. ఎస్. కృశ్చేవ్ ఉద్ఘాటించేరు. మార్క్సిజం-లెనినిజం దృక్పథాన్ని, 'ప్రపంచ కార్మికులారా ఏకము కండు!' అన్న మార్క్స్, ఏంగిల్స్‌ల నినాదాన్ని మేము అనుసరిస్తాము. మేము దానిని పవిత్రాశయంగా పరిగణిస్తాము. సమస్త దేశాల కార్మికులు ఏకమై, తమ శక్తులను సమీకరించుకొన్నట్లయితే వారు త్వరలోనే విముక్తిని పొందగలరు. కార్మికులు యీ విషయాన్ని అర్థం చేసుకొన్నారు. ప్రపంచ స్థాయిలో సైద్ధాంతిక పోరాటం కొనసాగుతుండగా శాంతియుత సహజీవనం సాధ్యమేనా అని యీ సందర్భంలో షపిరో అడిగారు.

అవును, అది సాధ్యమే. జీవితమే దీనికి సమాధానమిస్తుందని ఎన్. ఎస్. కృశ్చేవ్ అన్నారు. కార్మిక వర్గంయొక్క మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతమూ, బూర్జువా సిద్ధాంతమూ అనేక సంవత్సరాలుగా అస్తిత్వంలో వుంటున్నాయి. వీటి రెంటికీ మధ్య సంఘర్షణ సర్వత్రా చాలా కాలంగా కొనసాగుతూనే వున్నది. అయినప్పటికీ సోషలిస్టు దేశాలూ, పెట్టుబడిదారి దేశాలూ అస్తిత్వంలో వుంటూనే వున్నాయి.

యుద్ధాన్ని కల్పించే సూచనగల పరిస్థితులు యిప్పుడేమైనా వున్నాయా అని షపిరో అడుగగా, నేడు అలాంటి పరిస్థితులేమీ లేవని కృశ్చేవ్ సమాధాన మిచ్చారు. అలాంటి పరిస్థితులు పెట్టుబడిదారి దేశాల మధ్యనేగాక, పెట్టుబడిదారి దేశాలు, సోషలిస్టు దేశాల మధ్యకూడా లేవని కృశ్చేవ్ ఉద్ఘాటించారు. సమీప భవిష్యత్తులో శాంతి విషయాన్ని గురించి ప్రస్తావిస్తూ ఎన్. ఎస్. కృశ్చేవ్, రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు వుండిన పరిస్థితులకూ, యిప్పటి పరిస్థితులకూ మధ్య వున్న గొప్ప తారతమ్యాన్ని వివరించి చెప్పారు. ఆ కాలంలో హిట్లరు జర్మనీ యుద్ధానికై సర్వసన్నాహాలు చేసింది; జర్మనీ, ఇటలీ, జపాన్‌లు బెర్లిన్-రోమ్-టోకియో ఒడంబడిక అనబడేదానిని చేసుకున్నాయి. నిజమే యీనాడు కూడా అలాంటి "ఒడంబడికలు" చాలా వున్నాయి, కాని ఆ కాలపు జర్మనీ మాత్రం లేదు; విభిన్న వ్యవస్థలు గల రెండు జర్మన్ రాజ్యాలున్నాయి. ఫ్రాంసు కూడా ఆనాటి ఫ్రాంసులా లేదు, అక్కడ అత్యంత బలమైన కార్మికోద్యమం వుంది. ఇటలీ కూడా అప్పటికంటె భిన్నంగా వుంది. శాంతి పోరాటం సాగించే శక్తులు అక్కడ బాగా పెంపొందాయి. మొత్తంమీద యూరప్, ఆసియాలలో పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. పూర్వం ఒక్కటే సామ్యవాద రాజ్యం వున్నట్లయితే (అంటే సోవియట్ దేశం) యీనాడు ప్రపంచ సామ్యవాద వ్యవస్థ వుంది. అంతే కాకుండా సోవియట్ దేశంకూడా 1941 లో వున్న వ్పటిదానికి పూర్తి భిన్నంగా వుంది. ఈ నాడు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకై పోరాడుతున్న ఆసియా ఆఫ్రికా రాజ్యాలలోనూ, తదితర దేశాలలోనూ జరుగుతున్న పరిణామాల నొకసారి చూడండి. ఇక్కడ ప్రతిదీ ఉడుకులెత్తుతూంది. ప్రజలు వలస పెత్తనంనుండి విముక్తి పొందుతున్నారు. వారు స్వేచ్ఛాయుత మానవ జీవితం గడపదలచుకున్నారు. ఈజిప్టులో తన దుస్సాహస చర్యవల్ల బ్రిటన్‌కు లభించినదేమిటి? ఏమీలేదు! ఈనాడు అమెరికన్ సామ్రాజ్యవాదులు, మధ్యప్రాచ్యంలో బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల స్థానాన్ని ఆక్రమించుకోవలచారు, కాని అందులో వారు కృతకృత్యులు కాలేరు. సిరియాపై టర్కీచే దాడి జరిపించడానికి ప్రయత్నిస్తూ డల్లెస్ చేపట్టిన దుస్సాహస కార్యం సైనిక విషయకంగా భగ్నమవుతూంది; కాని డల్లెస్ యింతవరకు తన పథకాలను విడిచిపెట్టలేదు; సిరియాలో ఒక తిరుగుబాటు లేవదీసి, అమెరికన్ గుత్తవ్యాపారస్తులకు అనుకూలమైన ప్రభుత్వాన్ని నెలకొల్పగల తాబేదారుల కోసం ఆయనీనాడు వెదుకుతున్నారు.

ఉదాహరణకు ఇండియా, బర్మా, ఇండోనేషియాలను తీసుకుందాము శాంతి పోరాటంలో వాటి వాణి గంభీరంగా బలంగా ధ్వనిస్తూంది.

అయితే, దీనిఅర్థం యుద్ధం ప్రారంభం కాజాలదని కాదు. ఎందుకంటే నేనిదివరకే చెప్పినట్లు పిచ్చివాడి విషయంలో ఎవరూ బాధ్యత వహించలేరు, అని నొక్కి చెప్పేరు కృశ్చేవ్. అయితే శక్తుల వాస్తవ సంబంధాలు ఏవిధంగా వున్నాయంటే సైనికవాదులూ గుత్తవ్యాపారులూ యుద్ధాన్ని ప్రారంభించేముందు పదేపదే బాగా ఆలోచించవలసివుంటుంది. యుద్ధం ప్రారంభమైనట్లయితే — ఏ వొక్క సామ్యవాదరాజ్యానికి యుద్ధమంటే ఆశక్తిలేదుకాబట్టి అది

కేవలం సామ్రాజ్యవాద దేశాలవల్లనే ప్రారంభంకాగలదు—పెట్టుబడిదారీ విధానం నాశనమవుతుంది; అది పెట్టుబడిదారీ ప్రపంచం మానవ జాతిమీద విధించే చరమవ్యధ అవుతుంది, ఎందుకంటే పెట్టుబడిదారీ విధానం శాశ్వతంగా నాశనంచేయబడుతుంది.

పెట్టుబడిదారీ, సామ్యవాద దేశాల ప్రతినిధుల సమావేశమొకటి జరగడం గురించిన షపిరో ప్రశ్నకు జవాబిస్తూ కృశ్చేవ్, సమీపభవిష్యత్తులో అటువంటి సమావేశం జరిగే అవకాశం లేదని అన్నారు. అటువంటి సమావేశాన్ని జరపడమంటే వాస్తవపరిస్థితిని దృష్టిలోకి తీసికొని పక్షాలు, అవసరమైన ఒడంబడికను సాధించేందుకు కృషిచేయడమన్నమాట; ఇది ఒక షరతుమీదమాత్రమే—ఆయాశక్తుల సంబంధాలను, అంటే సామ్యవాద, పెట్టుబడిదారీ దేశాల అస్తిత్వాన్ని, గుర్తించడమూ, ఒకరి ఆంతరంగిక వ్యవహారాలలో యింకొకరు జోక్యం కలిగించుకోకపోవడమూ చేసినట్లయితే—జరగగలదు. సామ్యవాద దేశాలు శిలవలె దృఢంగా వున్నాయి. పాశ్చాత్య దేశాల షరతులమీద జర్మన్ సమస్యా పరిష్కారమూ- లేదా డల్లెస్ అంటున్నట్లు తూర్పు యూరోపియన్ సమస్యను చర్చించడమూవంటి రాజకీయ షరతులన్నిటినీ మేము త్రోసిపుచ్చుతాము అన్నారు కృశ్చేవ్. అసలు అటువంటి సమస్య లేదు. దేశాలు తమ స్వంత సాంఘికవ్యవస్థలను కలిగి అస్తిత్వంలో వున్నాయి; దేశాలన్నిటిమధ్య సంబంధాలు, చైనా ఇండియాలు ప్రతిపాదించినటువంటీ, బాండుంగ్ సమావేశంలో రూపొందించబడినటువంటీ శాంతియుత సహజీవన పంచసూత్రాల ప్రాతిపదికపై నిర్మించబడితీరాలి. ఇది గుర్తింపబడకపోయినట్లయితే సమావేశం కావడంలో అర్థంలేదు, ఎందుకనగా సమావేశంలో చర్చలుజరపడం నిష్ప్రయోజనకరం, దానివల్ల ఫలితమేమీ వుండదు.

నిరాయుధీకరణ సమస్యను గూర్చిన చర్చగురించీ, మిత్రరాజ్యసమితి ఉపసంఘంనుండి సోవియట్ దేశం వైదొలగడం గురించీ అడిగిన ప్రశ్నకు కృశ్చేవ్ యీవిధంగా చెప్పేరు: మిత్రరాజ్యసమితి ఉపసంఘం మూడేళ్ళపాటు పనిచేసింది. అమెరికా, బ్రిటన్, ఫ్రాంసులు చేసిన అనేక ప్రతిపాదనలను సోవియట్ దేశం ఆమోదించింది. సోవియట్ దేశం యీ విషయాన్ని ప్రకటించిన వెంటనే అమెరికన్లు, బ్రిటిష్‌వారూ, ఫ్రెంచివారూ తమ ప్రతిపాదనలనే గౌరవించలేదు. ఒప్పందాన్ని సాధించడానికి మావంతుకు చేయగలిగినదంతా చేశాము. అసలు విషయమేమిటంటే అమెరికా నిరాయుధీకరణను వాంఛించడంలేదు: దానికిష్టంలేకపోయినప్పుడు మనమేదో ప్రయోజనకరమైన చర్చలు జరుపుతున్నామనే అభిప్రాయం కలిగించి ప్రజలను ఎందుకు మోసపుచ్చాలి. తెరవెనుక చర్చలు జరపడం ద్వారా పాశ్చాత్య రాజ్యాలు తమ ఆయుధోత్పత్తిని కప్పిపుచ్చుకోవాలనీ, తమ ఆయుధాలను నిలవచెయ్యడాన్ని కొనసాగించేందుకై వ్యవధి సంపాదించాలనీ, ప్రపంచమంతటినీ ప్రచ్ఛన్నయుద్ధస్థితిలో ఉంచాలనీ అనుకుంటున్నాయని మా అభిప్రాయం. సోవియట్‌దేశం ఉపసంఘంపనిలో పాల్గొనకుండావుండడం మేలనీ అప్పుడు ప్రపంచ ప్రజలు కనీసం ఉపసంఘంపని విలువను గమనిస్తారనీ, పెట్టుబడిదారీ దేశాల ప్రభుత్వాలపై మరింత ఎక్కువగా ఒత్తిడి చేయడం ప్రారంభిస్తారనీ మేమనుకుంటున్నాము. ప్రభుత్వాలు ప్రజల మనోభిలాషను గణనలోకి తీసుకోవలసివస్తుంది, ఒప్పందాలకై ప్రయత్నించవలసి వస్తుంది. సోవియట్ దేశం మాత్రం నిరాయుధీకరణ గూర్చి సబబైన ఒడంబడికలు చేసుకోడానికి సర్వదా సిద్ధంగావుంది.

ద్విపక్ష ప్రాతిపదికమీద అమెరికాతో చర్చలు జరిపే అవకాశం గురించి షపిరో ఒక ప్రశ్న వేయగా కృశ్చేవ్ దానికి సమాధానమిచ్చారు. ఈ విషయమై మేమిదివరకే ఒక ప్రకటన చేశాము; కాని మా అభిప్రాయాలు తప్పుగా చిత్రించబడుతున్నాయి. ఎందుకంటే అమెరికాలోని కొందరు నాయకులు మన దేశాలమధ్య సంబంధాలు అభివృద్ధి అయితే అంతర్జాతీయ ఉద్రిక్తత తగ్గుతుందేమోనని భయపడుతున్నారు. సోవియట్ దేశాన్ని సైనిక స్థావరాలతో చుట్టుముట్టేమంటూ అమెరికన్ నాయకులు సోవియట్ దేశాన్ని బెదరిస్తున్నారు. ఇది నిజమే, కాని అధునిక సైనిక సామగ్రివల్ల, సబ్‌మెరైన్లనుండీ, బాలిస్టిక్ రాకెట్ల సాయంతోనూ అమెరికా యొక్క ప్రధాన కేంద్రాలన్నిటిమీద కాల్పులు సాగించడానికీ, అమెరికన్ రేవులకు దిగ్బంధన కలిగించడానికి వీలవుతుందని జ్ఞాపకముంచుకోవాలి అన్నారు కృశ్చేవ్. కాబట్టి ఆధునిక సైనిక సామగ్రి అభివృద్ధి మూలంగా, అన్ని దేశాలలాగనే అమెరికా కూడా దెబ్బకు అందుబాటులో వుంది.

మార్షల్ జుకోవ్ విడుదల సందర్భంగా ఇతర దేశాలలో, సోవియట్ నాయకత్వంలో అస్థిరత్వాన్నిగూర్చి అనుకుంటున్నారని షపిరో చెప్పగా, కృశ్చేవ్ ఇలా ఉద్ఘాటించారు: అందుకు భిన్నంగా, సోవియట్ దేశపు అగ్ర సంస్థల కూర్పులో మార్పులు సమిష్టి నాయకత్వపు బలాన్నీ, దాని స్థిరత్వాన్నే సూచిస్తున్నాయి.



# శాస్త్రీయ ప్రాతిపదికమీద నిర్మితమైన సమాజం




నేడు విజ్ఞాన శాస్త్రం మన సాంఘిక జీవితంలోని ప్రతి అంశంలోకీ చొరుచుకొని పోతున్నది. కాని ఆ వైజ్ఞానిక పద్ధతులు అనువర్తింపజేయడంవల్ల లభ్యమయ్యే ఫలితాలు ఎప్పుడూ ఆయా సాంఘిక వ్యవస్థలపై ఆధారపడే ఉంటాయి.

సమాజంయొక్క నిరంతరాభివృద్ధికీ వైజ్ఞానిక జోస్యాలు చెప్పడానికీ, ఆర్థిక, సాంఘిక విపత్తులు సంభవించకుండా నిరోధించడానికీ వైజ్ఞానిక పద్ధతులను సమర్థతతో అనువర్తింపజేయడం, సమాజంయొక్క ఆర్థిక నిర్మాణం అనుమతించినప్పుడూ, విజ్ఞాన శాస్త్రం తమ ఆధీనంలో ఉండి, ప్రపంపపంచాన్ని మార్చడానికీ, సాంఘిక పరిణామాన్ని నిర్దేశించే సూత్రాలను తెలుసుకోడానికీ దానిని వినియోగించుకొనగల స్థితిలో ప్రజలు వున్నప్పుడూ మాత్రమే పూర్తిగా సాధ్యమవుతుంది.

అలాంటి సిద్ధాంతమే సోషలిజం యొక్క మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతము. సోవియట్ సమాజంయొక్క ఆర్థిక, రాజకీయ పునాది అదే. చరిత్రనూ, సమకాలీన సమాజాన్నీ సమగ్రంగా పరిశీలించి, సంశ్లేషించుట ఫలితమే యీ సిద్ధాంత సూత్రాలు. సార్వజనీన సమానత్వం, పురోభివృద్ధిని చేకూర్చే న్యాయమైన సమాజ వ్యవస్థ కొరకు ప్రాచీన కాలంనుంచి పోరాడుతున్న ప్రజల సైద్ధాంతిక, ఆచరణాత్మక అనుభవాల సూత్రీకరణలే యీ సిద్ధాంతం.

ఉత్పత్తి సాధనాలు సమాజపు ఆస్తిగా మారినప్పుడు నూతన ఆర్థిక సూత్రాలు అస్తిత్వంలోకి వస్తాయి. వాటిలో ప్రధానమైనది ఒక ప్లాను ననుసరించి జరిగే ఆర్థికాభివృద్ధికి సంబంధించిన సూత్రం. ముడి వస్తువులనూ, శ్రమిక శక్తినీ అవసరమైన విధంగా పంపకం చేసి ఆర్థిక రంగంయొక్క వివిధ శాఖలలో సమన్వయాన్ని చేకూర్చడానికి ఇది తోడ్పడుతుంది. కాని ఉత్పత్తి గట్టి శాస్త్రీయపద్ధతులపైన జరిగేట్టు యేర్పాట్లు చేయబడినప్పుడు మాత్రమే యీ సూత్రానుసరణ వల్ల ఫలితాలు సంపూర్ణంగా లభిస్తాయి.

దేశ ఆర్థిక రంగాన్ని యీ విధంగా శాస్త్రీయ పద్ధతులపైన నడుపుతున్న సంస్థే సోవియట్ మంత్రిమండలి యొక్క ప్రభుత్వ ప్లానింగ్ కమిషన్. అది దేశంయొక్క ఆర్థిక మేధస్సు. ఆర్థిక రంగానికి సంబంధించిన వివిధ విషయాల నన్నింటినీ క్రోడీకరించి ఒక చక్కని ప్రభుత్వపథకాన్ని సంసిద్ధపరుస్తుంది. అలాంటి పథకం, ఆర్థిక మూలాధారాలు ఒక నిర్ణీతకాలంలో యేవిధంగా వినియోగించుకొనబడాలి, అవి ఎలాంటి ఫలితాలను చేకూరుస్తాయి అన్న విషయాలను పరిశీలించి నిర్ణయిస్తుంది. ఆ పథకం దెశానికి యెంత లోహం, బొగ్గు, నూనె, విద్యుచ్ఛక్తి అవసరమో అంచనా వేసి, యే ఆర్థిక మండలాలు వాటిని సరఫరా చేస్తాయి, వేతనాలు ఎంత ఎక్కువవుతాయి, పెరుగుతున్న ప్రజావసరాలను తీర్చడానికి యే వస్తువులు అవసరం అన్న విషయాలను నిర్ణయిస్తుంది. కాని యింతేకాదు. ప్లానింగ్ ఆర్థిక విషయాలకు సంబంధించిన అంకెలనూ, విస్తృత మవుతూ వున్న ఆర్థిక వ్యవస్థ కోరేవాటినీ పరిగణించడం మాత్రమే కాదు, సోవియట్ దేశంలోని వివిధ జాతుల ప్రయోజనాలను కూడా పరిగణించి, తమ, స్వీయ జాతీయ ప్రవీణులకు శిక్షణ నివ్వడానికీ, తమ ఆర్థిక, సాంస్కృతిక జీవితాన్ని సత్వరగతిలో పెంపొందించుకోవడానికీ అనుకూల పరిస్థితులను కల్పించాలి కూడా.

ప్రస్తుతం, ప్రభుత్వ ప్లానింగ్ కమిషన్ ప్రతి యూనియన్ రిపబ్లిక్కు, పరిపాలనా ఆర్థిక మండలమూ నెరవేర్చవలసిన వంతును నిర్ణయిస్తుంది. ప్రతి ఆర్థిక మండలంలోనూ నెలకొల్పబడిన ఆర్థిక సంఘాలు, సమగ్రమైన ప్రభుత్వ పథకంలో భౌతిక ఆధారాలనూ, పథకం ఉత్పత్తినీ పంపిణీ చేయగలవు. సరికొత్త వైజ్ఞానిక విజయాలపైని ఆధారపడి ఉత్పత్తిని సమీకరించడానికి తోడ్పడే స్వంత ప్లానింగుశాఖలు, ప్రతి పరిశ్రమకూ ఉన్నాయి.

సామ్యవాదంలో శాస్త్రీయమైన ప్లానింగు ఒక్క ఉత్పత్తికి మాత్రమే వర్తించదు. విజ్ఞాన శాస్త్రానికి కూడా వర్తిస్తుంది. సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు దాని నిర్మాణకేంద్రం; వైజ్ఞానిక పరిశోధనమార్గాన్ని అది నిర్ణయిస్తుంది. దేశపు విస్తరిస్తోన్న ఉత్పత్తి అవసరాలను గణనలోనికి తీసుకుని, పరిషత్తు వైజ్ఞానిక శక్తులను పంపిణీ చేస్తుంది — ఆర్థిక వ్యవస్థ తక్షణావసరాలను నెరవేర్చడానికి కొన్ని ఉపయోగింపబడి, క్రమక్రమంగా వృద్ధిచెందుతోన్న ఉత్పత్తి క్రమాలు రేకెత్తించిన వేలాది సమస్యలను పరిష్కరిస్తాయి. ఇక యితర వైజ్ఞానిక సంస్థలు, దీర్ఘకాల పరిశోధనా కృషిలో నిమగ్నమై వుంటాయి; యిది భవిష్యత్తును యీషన్మాత్రంగా మనలను దర్శింపజేస్తుంది. ఈ రెండవ కృషి, ప్రస్తుతానికి సంబంధించినంతవరకూ లాభదాయకంగా కనిపించదు. కాని, ప్రకృతిపై మానవుని ఆధిక్యత స్థాపనకు సాయపడుతుంది గాబట్టి, దూరదృష్టితో చూసినట్టయితే యిది అమూల్యమైనది.

సోవియట్ దేశపు తాత్త్వ్విక పునాది, మార్క్సిస్టు-లెనినిస్టు ఉద్బోధ. ప్రపంచాన్ని సంశ్లేషించి, పరివర్తన గావించడానికి యీ బలవత్తరమైన పరికరం చేతగల ప్రభుత్వం, అభివృద్ధిదశ ప్రతి ఒక్క దానిలోనూ, సోవియట్ ప్రజల మూలావసరాలకు అనుగుణమైన విధానాన్ని తయారు చేయగలుగుతుంది. దాని ముఖ్యాశయం, శ్రామికప్రజల జీవన ప్రమాణాన్ని నిరంతరం హెచ్చించడమూ, కమ్యూనిజానికి క్రమక్రమపరిణామానికి పరిస్థితులను సృష్టించడమూ



అకెడె
మీషియన్
జోసెఫ్ ఓర్బెలీ

# రష్యాలో భారత

## [సంక్షిప్త చరిత్ర]

భారత దేశాన్ని గురించీ, భారత ప్రజల గురించీ, యుగయుగాలుగా ఆ ప్రజలు సృష్టించిన ఉదాత్తమైన, మహోన్నతమైన అక్షయ సంస్కృతిని గురించీ అధ్యయనం చేస్తున్నప్పుడు, సోవియట్ దేశ ప్రాచ్య విద్యావేత్తలు ఈ విపుల కృషిలో వివిధమైన సమస్యలను ఎదుర్కొనవలసి వస్తుంది

ఈ కృషి ఎంత బృహత్తరమైందో తెలుకోవడానికి, విప్లవానికి పూర్వం, రష్యాలో భారత విజ్ఞాన పరిశీలనలో సాధించబడిన వాస్తవమైన ఘనవిజయాలను స్మరణకు తెచ్చుకోవడం అవసరం. రష్యాదేశపు ప్రాచ్య పరిశోధనలలో, ఆదినుంచీ భారత దేశం ప్రాముఖ్యాన్ని పొందింది, కొన్ని విషయాలలోనైతే ప్రథమస్థానం భారత దేశానికే యివ్వబడింది.

విప్లవానికి పూర్వం, రష్యన్ శాస్త్ర విజ్ఞానపరిషత్తు, 'సెయింట్ పీటర్స్ బర్గ్ పరిషత్' అని వ్యవహరించబడుతూ, శాఖోపశాఖలతో, విద్యాశాలలతో, శాస్త్రీయ మందిరాలతో సెయింట్ పీటర్స్‌బర్‌లో సంస్థాపితమైంది. 1854లో, సెయింట్ పీటర్స్ బర్గ్ విశ్వవిద్యాలయం ప్రాచ్య భాషావిభాగాన్ని నెలకొల్పింది. రష్యాలో అటువంటి పరిశోధనశాఖ అదొక్కటే. భారత విజ్ఞాన పరిశోధన, రష్యా దేశంలో ప్రప్రథమంగా ఇక్కడే. ఇప్పుడు లెనిన్‌గ్రాడ్ అనబడే ఈ సెయింట్ పీటర్స్‌బర్గ్‌లోనే అభ్యున్నతికి తీసుకరాబడినది.

భారత విద్యాధ్యయనానికి, 19వ శతాబ్దంలో రష్యా చేసిన మహోపకారం, ప్రాచీన భారత భాషయైన సంస్కృతానికి, ఏడు సంపుటాల నిఘంటువును సంతరించడం. ఈ విశిష్ట కృతికి కారకుడైన నిఘంటుకారుడు అకడమీషియన్ బెత్లింగ్.

భారత సంస్కృతికి సంబంధించిన రష్యన్ పరిశోధనలు, మినాయెవ్ తరువాత కేవలం నైఘంటిక, భాషాతత్వ శాస్త్రాలకే పరిమితం కాలేదు. భారత దేశాన్ని గురించి వ్రాసిన తన రచనలలో భాషాతత్వ జిజ్ఞాసనే కాక, విశిష్ట రష్యన్ ప్రాచ్య విద్యావేత్త మినయేవ్, మూలగ్రంథ వ్యాఖ్యల కెక్కువ లక్ష్యమిచ్చి, బౌద్ధాన్ని ఒక తత్వశాస్త్రంగా సమగ్రంగా అధ్యయనం చెయ్యడానికి ప్రాతిపదిక వేశారు. ఆయన సుప్రసిద్ధ శిష్యద్వయం, అకెడమీషియన్ ఎస్. ఎఫ్. ఓల్డెన్‌బర్గ్, అకెడెమీషియన్ ఎఫ్.ఐ. ష్చెర్బత్‌స్కోయ్‌లు, భారతీయ భాషా తత్వశాస్త్ర పరిశోధనలూ, బౌద్ధాన్నీ, భారత సంస్కృతినీ ఏకోన్ముఖంగా సమీక్షించి, ఒక సమన్వయాన్ని సిద్ధింపజేసి గురుపీఠాన్నే అధిగమించారు. విమర్శకులుగా, ప్రౌఢవ్యాఖ్యాతలుగా యీ పండితులు శేఖరస్థాయికి వచ్చినది సోవియట్ పరిపాలనలోనే.

భారత విద్యావేత్తలయిన యీ రష్యన్ పండితులిద్దరి కృషికీ ప్రత్యేక విలువనిచ్చినది, వైశిష్ట్యాన్ని చేకూర్చినది తమ పరిశీలనలో వారు, భారత దేశ భౌగోళిక, రాజకీయ పరిధుల నధిగమించగలగడమే. తమ రచనలద్వారా, శిష్యుల పరిశీలనలకు విస్తృతి కల్పించుటద్వారా వారు, బౌద్ధాన్ని ఒక్క భారత దేశానికి సంబంధించినంతవరకేగాక, ఆ మతానుయాయులున్న టిబెట్, మంగోలియన్ దేశాలు, జపాను దీవులలో సమన్వయించి సవిస్తరంగా చర్చించారు.

ష్చెర్బత్‌స్కోయ్, తను ప్రత్యేకంగా లిఖిత బౌద్ధ కథాసాహిత్యానికి, బౌద్ధానికి ప్రామాణికమైన మూలగ్రంథాలకు, శాసనాలకు లక్ష్యమివ్వడమేగాక, అనుయాయుల దృష్టినికూడా వాటిపట్ల కేంద్రీకరింపచేశారు. భారతీయ తర్క శాస్త్రాన్నికూడా నిశితంగా అవలోకించారు. ఇంకొకవంక ఓల్డెన్‌బర్గ్, భారత ప్రాచీన కళా పరిశోధన తన ధ్యేయంగా చేపట్టారు. ఓల్డెన్‌బర్గ్, ష్చెర్బత్‌స్కోయ్‌లు, భారతీయ విజ్ఞాన పరిశోధనకు బెత్లింగ్ నిఘంటువుకు ఏమాత్రం తీసిపోని, రష్యన్ శాస్త్ర విజ్ఞానానికి మరోకోశాన్ని, "బిబ్లియోతెకా బుద్ధికా" సంపుటాలను సంతరించి పెట్టారు. పారిషదుల మన్ననలను, గౌరవాదరణలను ఈ నాటికీ చూరగొంటున్న ఈ మహత్తర సంపుటాలు, అపూర్వ కానుకలే గాక, ఓల్డెన్‌బర్గ్, చైనీస్ తుర్కిస్తాన్‌కు సంబంధించిన సాంస్కృతిక కళాసంచయ పరిశీలనల (దురదృష్ట వశాన అసమగ్రంగానే నిలచిపోయిన, విస్తృత నివేదిక పేర్కొనదగినది.

పరిశీలనారంగాలలో ఓల్డెన్‌బర్గ్‌కు అభిమానపాత్రమైన వాటిలో ఒకటి గ్రామీణ సాహిత్యమన్నది సువిదితమే. పరిశోధక కృషిలో

## అకెడిమీషియన్ జోసెఫ్ ఓర్బెలీ

ఆయన సాధించిన అమూల్యాంశాలలో ఒకటి ప్రాచీన, మధ్య, ఆధునిక యుగాల భారతీయ కళా వివరణ. భారతీయ విద్యాధ్యయనవేత్తగానే గాక, ఓల్డెన్‌బర్గ్ ఇరానియన్ భాషలలో, సంస్కృతీ శాఖలలో ప్రవీణుడనీ, పలుకుబడిగలవాడనీ. పాశ్చాత్య ప్రజల గ్రామీణ సారస్వతంలో మంచి ప్రవేశం వున్నవాడనీ అర్థం చేసుకున్నట్టయితే, వర్ధమానమవుతున్న ఏయుధేక సాంస్కృతిక పథంలో కృత్రిమావరోధ కల్పనకు ఏ ఒమకాయన అంత తీవ్ర వ్యతిరేకోవిశదం కాక పోదు. అంతేగాక, 19వ శతాబ్దంలోనూ, 20వ శతాబ్దారంభంలోనూ రష్యన్ ప్రాచ్య భాషావేత్తలు. భారత మహాకావ్యం, పర్షియన్ భాషలోకి 'కాలిలా, డిమ్నా' అని అనువదితమైన 'పంచ తంత్రం' పట్ల ఎందుకంత ఆసక్తి వహించారో, మంగోలియా వాసులలో అత్యంత ప్రాచుర్యానికి వచ్చిన ఈ గ్రంథాన్నిగూర్చి. అకెడెమీషియన్ వ్లాదిమిరిత్సేవ్ చేసిన విలువైన పరిశీలన ఎంత ప్రాధాన్యం కలిగినదో తేటతెల్లమవుతుంది.

కీర్తిశేషుడైన అకెడెమీషియన్ క్రచ్‌కోవ్‌స్కీ పత్ర సంచయంలో, 'ఓల్డెన్‌బర్గ్ బహిరంగోపన్యాసాలు' అన్న శీర్షికను క్రమానుసారంగా క్రచ్‌కోవ్‌స్కీ అప్పటిలో ముద్రణకని సంకలితంచేసిన లిఖిత పత్రాలను చూచినప్పుడు, మాకు ఎంతో సంతోషం కలిగింది.

ఓల్డెన్‌బర్గ్ చేసిన ఈ బహిరంగోపన్యాసాలన్నీ భారత కళా సంస్కృతులకు సంబంధించినవి. కశేషియా ప్రజల సంస్కృతిని అధ్యయనం చేస్తోన్న భారతదేశానికి దూరంగావున్న మేము, అందువల్లనే చాలా ఉత్సాహంతో ఓల్డెన్‌బర్గ్ శిష్యకోటిలో చేరి, ప్రాచ్య ప్రజలు మహత్తర మానవ సంస్కృతికి చేసిన మహోపకృతిని శక్తి వంచన లేకుండా విశదీకరించడానికి కృషి చేస్తాము.

ఓల్డెన్‌బర్గ్ శ్రోతలు అందుచేతనే సారవంతమైన గ్రీస్, భారత, బాక్ట్రియా సంస్కృతీ క్షేత్రాలలో ప్రభవించిన గ్రెయికో-బాక్ట్రియన్ కళా సమీక్షను, ఉత్తర మంగోలియాలోనూ, ఆల్తాయ్ మండలంలోను సంస్కృత భాషా సంస్కృతికి సంబంధించిన నిక్షిప్త నిధులగురించిన (కె వి. త్రెవెర్, ఎస్. ఐ. రుదెన్కో రచనలు) రచనలను వెలయింపజేయగలిగిగారు.

సోవియట్ దేశ శాస్త్ర విజ్ఞాన పరిషత్తులో యువ పండితుడు ఎ. పి. బరన్నికొవ్‌కు సభ్యత్వాన్నివ్వడం, రష్యన్ భారత విద్యా పరిశోధనల అభివృద్ధికర పరిణామంలో ప్రప్రముఖమైన ఒక నూతన దశకు వేదిక అయింది. ఒకవంక భారత ప్రాచీన సాహిత్యభాష సంస్కృతాన్ని, ఆ భాషలోని అనశ్వర సాహిత్యాన్ని అభిమానిస్తూ, బరన్నికోవ్ భారత దేశపు ఆధునిక భాషల అధ్యయనానికీ బోధనకూ ఎక్కువ ప్రాముఖ్యమిచ్చారు. ఆధునిక భారత రచయితలు సృష్టించిన అపార నిధులను, భారత ప్రజల విశిష్ట సృజనాత్మక శక్తులతో సమన్వయించి సోవియట్ ప్రజలకు విశదీకరించగల వాటిని పరిశోధిస్తున్న యువ సాహితీవేత్తలను కలిగివున్నామంటే, ఇది బరెన్నికోవ్ కృషి ఫలితమేనని పేర్కొనవలసి వుంది.

ఏమైనప్పటికీ. వర్తమాన భారతంపట్లగల ప్రేమాభిమానాలతో భారత ప్రజల గత వైభవాన్ని, ఆ దేశపు ప్రాచీన సాంస్కృతిక నిధులను, గురుతర సాహిత్యాన్ని, ఆర్షచారిత్ర శావశేషాలను అవలోకించనట్టయితే తప్పటడుగువేసినట్టవుతుంది. మహాభారతం, రామాయణం, అమరకవి కాళిదాస్ నాటకాలవంటి మహత్తర కృతులను నిర్లక్ష్యం చేసినట్టయితే మహాపరాధం కాగలదు. ఓల్డెన్‌బర్గ్ వంటి (లిఖితసాహిత్యాన్ని, వలుభాషా ఖండికలను, ఇతిహాసాలను, కథలను. సామెతలను, ఆనోట ఆనోట ప్రజలచేత చెప్పుకొనబడే నీతికథలనూ) అనేక సమస్యల పరిష్కారానికి ప్రతి ఆధారాన్నీ ప్రతిభావంతంగా వినియోగించుకొన్న పండితుని, ఆ ప్రాజ్ఞుని అనుభవాలను ఉదాహరణగా పెట్టుకొన్న మేము, మాకృషిని, అధ్యయనాన్నీ కేవలం సంకుచిత క్షేత్రాలకు పరిమితం చెయ్యడం క్షమార్హం కూడా కాదు. ఇంతకూ, ఈ పరిమిత పరిశోధన రంగాల హద్దులు, కేవలం చరిత్రనూ, భాషాతత్వశాస్త్రాన్నీ వివరించడానికి చేసిన ప్రయత్నకారణంగా ఏర్పడినవేగాని, ఒకదానికొకటి సంబంధంలేక విడివడినవి కావు, యీ పరిమితులు సమన్వయాన్ని కోరేవేగాని విభజనను సమర్థించేవి కావు. సుసంపూర్ణమైన, సకల గ్రాహకమైన ప్రాతిపదికమీద రచించబడిన చరిత్ర ఒక్కటే నిజానికి మానవ వర్మశాస్త్రంగా రూపొందగలదన్న అంశాన్ని విస్మరించడం కూడా క్షమార్హం కాదు.

కాబట్టి, త్వరలో నిశ్చితమూ విస్తారమూ అయిన వి.ఎం బెస్క్రొవ్నీ 'హిందీ-రష్యన్', 'రష్యన్-హిందీ' నిఘంటువు (80 ఫారములు) ద్వితీయ ముద్రణ వెలువడుతున్నందుకు ఎంతో సంతోషిస్తున్నాము. సోవియట్ పాఠకునికి యీ నిఘంటువు, నవీన భారతీయ సారస్వతంతోను, సమకాలీన భారత జీవితంతోటి పరిచయాన్ని కల్పించుకొనడానికి విపులావకాశాన్నిస్తున్నది.

అందుచేతనే మేము, "అర్థశాస్త్రం", ఒక మహత్తర సమిష్టి రచన రష్యన్ అనువాదం. త్వరలో ప్రచురితం కాగలదన్న ఆకాంక్షతో నిరీక్షిస్తున్నాము. భారత ప్రజలు సృష్టించిన మహత్తరమైన వాటిలో ఇదొకటి. యుగాల క్రిందట విరచించబడినదే అయినదే అయినప్పటికీ ఏమాత్రం దాని వెలుగు, దాని విలువ తరిగినది కాదు. అనువాదానికి ఓల్డెన్‌బర్గ్, షెర్బత్‌స్కీ, వారి శిష్యులు ఒబెర్మిల్లర్ వొస్త్రికోవ్ లు విరచించిన వ్యాఖ్యానాలున్నాయి. ఈ పండితులు నలుగురూ కీర్తిశేషులైనందున, వ్యాఖ్యలప్రతి వారి శిష్యుడు వి. ఐ. కల్యనోవ్ ముద్రణకు సిద్ధపరిచారు.

# వివాహ మహోత్సవం



వాల్యా పెసెలోవా, యూరీ మెలెషోవ్‌ల వివాహాన్ని, వివాహాల రిజిస్ట్రేషన్ కార్యాలయోద్యోగులు రిజిస్టర్ చేస్తోన్న దృశ్యం.

*

వివాహం, సాయంత్రం జరుగబోతున్నది. ప్రొద్దుటినుంచే ఇల్లంతా చెప్పలేనంత సందడిగా వున్నది. ద్వారాలన్నీ పూర్తిగా తెరిచి వున్నాయి. వధూవరుల మిత్రులు చురుకుగా యేర్పాట్లు చేస్తున్నారు. యువకులు పూలదండలనూ, పూలగుత్తులనూ కడుతున్నారు. రంగురంగుల దీపపు గుమ్మటాలను తయారు చేస్తున్నారు. డోర్ బెల్ విరామం లేకుండా మ్రోగసాగింది. బహుమానాలివ్వడానికి ప్యాకెట్ల గుట్టలను మోసుకువస్తున్న అతిధులు రాసాగారు. వంటలగదిలోంచి కమ్మని వాసనలు రాసాగాయి. వంటలమనిషికి అనేకమంది సహాయపడుతున్నారు. తెల్లని ఏప్రన్‌లు ధరించిన







పైన: వివాహ మహోత్సవ సందర్భాన యువ దంపతులను బంధుమిత్రులభినందిస్తున్నారు.

*

దిగువ: ఆ తర్వాత అందరూ విందుకు. సందడిగా భోజనాల బల్లదగ్గర కూర్చున్నారు.



ఈ యువ వధూవరులు తలిదండ్రుల సౌభాగ్యానికి స్వస్తిపాన సమర్పణ చేస్తోన్న దృశ్యం



ఇంకా చెయ్యగలిగిందేమీలేదు. సంప్రదాయానుసారం అప్పుడు. నవ వధూవరులు ముద్దుపెట్టుకోవాలి



"చేదు!" అని కళా దర్శకురాలు, జినైదా మలిస్సెక్ హర్షధ్వానం చేసేసరికి, "చేదు" అని అందరూ నినాదంచేశారు

★

వారంతా వివిధరకాలైన కమ్మని వంటకాలనూ, ఒక పెద్ద వివాహపు కేక్‌నూ తయారుచేస్తున్నారు. పెండ్లికూతురు గదిలో దర్జీమనిషి తెల్లని పెండ్లిగౌనును పూర్తిచేస్తున్నది.

ఆ సందడి అంతటిలో చురుకుగా పాల్గొనకుండా ఉన్నవారు వృద్ధులైన పెండ్లికూతురు తల్లిదండ్రులే. యువకులంతా వాళ్ళను వాళ్ళగదికి తీసుకువెళ్ళి కూర్చోబెట్టి, "మీరిక విశ్రాంతి తీసుకోండి. మేము తెల్లవార్లూ వేడుకలతో గడుపుతాము." అన్నారు.

సాయంత్రం ఏడుగంటలకల్లా, ఆకుపచ్చని తోరణాలతో అలంకరింపబడిన ఇంటిముందు మోటారుకార్లు వచ్చి ఆగటం ప్రారంభించాయి. అతిధులు ఒక్కొక్కరే దిగసాగారు.

లోపల అన్నీ సిద్ధమయ్యాయి. సెమ్మెలలో కొవ్వొత్తులు వెలిగింపబడ్డాయి. ఇంటికప్పునుండి ఆకుల తోరణాలూ, పూల దండలూ, దీపపు గుమ్మటాలు వ్రేళ్ళాడగట్టబడ్డాయి. ఎక్కడ చూచినా పూలే కనబడుతున్నాయి. నీలి, గులాబి, ఎరుపు, తెలుపు రంగుల రబ్బరు బెలూన్లు ఇంటి కప్పుక్రింద రంగురంగు బట్టల అలంకరణల మధ్య తేలియాడుతున్నాయి

అన్నిటికంటే పెద్దదయిన గది మధ్యగా వివాహపు విందు కొరకు టేబుళ్లు అమర్చబడ్డాయి. కుర్చీలన్నీ గోడవరసను ఉంచబడ్డాయి. పక్కగదిలో జాజ్ బ్యాండుకొరకు యేర్పాట్లు చేయబడ్డాయి.

పెండ్లి రిజిష్టర్ చేయబడడంతో వివాహకాండ ప్రారంభమయింది. అసలు, సర్వసాధారణంగా జరిగేవిధంగా కాక, రిజిస్ట్రేషన్ కార్యాలయోద్యోగులు వివాహ మహోత్సవ స్థలానికే ఆహ్వానింపబడ్డారు. వివాహానికి వచ్చినవారందరి హర్షధ్వానాలమధ్య





పెండ్లి రిజిస్టరు చేయబడాలన్న ఉద్దేశంతో వారలా పిలిపింప బడ్డారు.

అతిథులందరూ టేబుల్ ముందుచేరి నూతన వధూవరుల ఆరోగ్యానికి టోస్టును ప్రతిపాదిస్తూ త్రాగసాగారు. వధూవరుల మిత్రులు ఒక్కరొక్కరే లేచి, నూతన వధూవరులకు ఆనంద దాయకమైన వివాహజీవితం చేకూరాలనీ, హృదయగతాకాంక్షలు యీడేరాలనీ కోరసాగారు. రష్యా వివాహాలన్నిటిలో మామూలుగా జరగేటట్టే, యెవరో ఒకరు గోర్కో (చేదు) అని కేకవేసినప్పుడనక నూతన వధూవరులు సిగ్గుపడుతున్నా ఒకరినొకరు ముద్దుపెట్టుకొల్లా తప్పలేదు.

వివాహపు విందుదగ్గర అంతా ఆనందదాయకంగాను, ఉల్లాసంగానూ ఉన్నది. ఆశ్చర్యపడవలసిన విషయం యేమున్నదీ వచ్చిన అతిథులంతా ఒకేచోట, ఒకే యంత్రాగారంలో పనిచేస్తున్నారు. ఒకరినొకరు బాగా అర్థం చేసుకొన్నవారు.

"అంతా ఒకసారి ఇటువినండి!" అంటూ ఒక యువకుడు కేకవేశాడు. ఆ గొడవలో అతనిమాట పైకి వినబడడమే కష్టంగా ఉన్నది. అలా కేకవేసి అతడు గబగబా లేచివెళ్ళి నడవలోకి వెళ్ళే తలుపు తెరిచాడు.

నూతన వధూవరుల మిత్రులూ, బంధువులూ, యంత్రాగారంలో వారితోకలసి పనిచేస్తున్నవారూ తెచ్చిన బహుమతులను తీసుకొని కొందరు యువజనులు లోనికి వచ్చారు. వారు పనిచేసే యంత్రాగారంలో ఫిట్టర్‌గా వుంటున్న అలిక్ షిలాక్ అనే ఒక యువకుడు ముందు నడుస్తూ, ఒక పెద్ద సిల్కు గుడ్డను తీసుకు వచ్చాడు. అతని వెనుకనే ఉన్న యువతులు ఒక ట్రేలో పెట్టిన డిన్నర్ సెట్లనూ, పూలుపెట్టుకొనే గాజుజాడీలనూ, చక్కని రిబ్బన్లతో కట్టబడిన ప్యాకెట్లనూ తీసుకొనివచ్చారు.

నూతన వధూవరుల మీద సిల్కుగుడ్డ కప్పబడ్డది. అంతా ఒక్కసారిగా నవ్వారు. బ్యాండువాళ్ళు వెంటనే లేచి బ్యాండు వాయించసాగారు. నృత్యం ప్రారంభంకావడానికి అది సూచన అందరూ టేబుల్‌దగ్గరనుండి వెళ్ళి నృత్యం చేయనారంభించారు.

నృత్యంచేసి అలసిపోయిన తర్వాత అంతా టేబుల్ దగ్గరికి తిరిగి చేరుకున్నారు. కొద్దిగా ఆలసట తీర్చుకొన్న తర్వాత సంగీత కచేరి ప్రారంభమయింది. ఒకరినిమించి మరొకరు శ్రావ్యంగా పాడారు. గాల్యా, పెత్యా మిరోనోవ్‌లు తాము స్వయంగా వ్రాసి స్వరకల్పనచేసిన పాటలను పాడారు. కొల్యా కొవలేవ్ అనే ఒక నవయువకుడు కజచొక్ నృత్యం చేశాడు. ఆ నృత్యంచూచి ఉత్సాహితుడై తాతలు ఇవాన్ గ్లెబోవ్ అనే ముసలి టర్నర్ రుస్కయా నృత్యం చేయడం ప్రారంభించేప్పటికి అందరికీ ఆశ్చర్యం కలగింది. మిఖైల్ వ్లసోవ్ అనే ఇంజినీరు హాస్యపు కథలను చెప్పసాగాడు. కథల తర్వాత ఒక యువకులజట్టు మళ్ళీ నృత్యం చేసింది. ఆ

↑ వాల్యా, యూరీలను పట్టు వస్త్రాలతో కప్పేసారు. సహచరోద్యోగులు యిచ్చిన కానుకలవి (ఎడమను పైన)

★

← అభివాద పరంపరల కార్యక్రమం. వాల్యా మామ్మగారు మారియా వెసెలోవా నవ దంపతులకు చిరాయురభివృద్ధులు కలగాలని ఆశీర్వదిస్తున్నది

★

↓ నృత్యంలో పాల్గొంటున్నారు అందరూ



నృత్యం తర్వాత యురి ఇవనోవ్ అనే ఒక కవి ప్రేమను గురించి తాను వ్రాసినకవిత్వాన్ని చదివాడు. నీకొరకే అన్న ల్యదోవ్ పాటను వాల్యా పాడింది. పాటల తర్వాత అంతా వలయాకారంగా చేరి నృత్యం చేయసాగాము.

అతిథులంతా యీ విధంగా ఉల్లాసంగా కాలం గడుపుతున్న సమయంలో మేము నీకు తోడు వాయిస్తాడు," అని డైరెక్టర్ వాల్యాతో అన్నాడు.

అకార్డియన్ వాయించే ఆ కొత్త యువకుడే యురా మెలిషా. అలా మొట్టమొదటి సారి పరిచయం కలిగింది. తర్వాత రిహార్సల్స్ సమయంలో తరుచు కలుసుకొంటుండేవారు. క్రమంగా ఆ మైత్రి ప్రేమగా మారింది. జీవి







కొద్దిగా వ్యవధి తీసుకొని యీ ఉత్సవానికంతటికీ మూల పురుషులైన యిద్దరు వ్యక్తులను గురించి చెబుతాను.

వాల్యా వెసిలోవా, యురా మెలిషేవ్ మాస్కోలోని లెనిన్‌గ్రాడ్ పేటలోని ఒక యంత్రాగారంలో పనిచేస్తున్నారు. వాల్యా సాంకేతిక నిపుణురాలు, యురా ఫిట్టర్‌గా పని చేస్తున్నాడు. కొద్ది నెలల క్రితమే అతడు సైన్యంలోంచి విడుదలై వచ్చి యీ పనిలో చేరాడు.

యంత్రాగారపు క్లబ్బులో ఈ యువతీ యువకులకు పరిచయం యేర్పడింది. చాలా సంవత్సరాలబట్టి వాల్యా యంత్రాగారానికి చెందిన సాంస్కృతిక దళంలో పాటలు పాడుతూ వుండేది. ఒక సంగీత కచేరీకి కొన్ని పాటలను తయారుచేయమని క్లబ్బు డైరెక్టర్ ఒక సారి ఆమెను కోరాడు.

"అకార్డిన్ వాయించే ఒక కొత్త యువకుడు వచ్చాడు. బాగా వాయిస్తాడు. అతను

తాంతంవరకూ కలసి వుందామని ఆ యువతీ యువకులిద్దరూ చివరికి నిర్ణయించుకొన్నారు.

వివాహానికి తేది నిశ్చయింపబడింది. సాంస్కృతిక దళంలోని వాళ్ళంతా పెండ్లికి రావడానికి నిశ్చయించుకొన్నారు. యంత్రాగారంలో వారితో పాటు పనిచేస్తున్నవారిలో కూడా చాలామంది పెండ్లికి రావాలని

(మిగత 33వ పుట చూడండి)



వాద్య సంగీతం 'వాల్టజ్'తో ప్రారంభమైంది. భేరీ వాద్యకారుడు, స్లావా షెలొవిన్, నవ్వుతున్నాడు. "ఎదురులేనిది వాల్టజ్ గాన లహరి" (ఎడమను) వాల్యా పాడుతున్నది. యూరీ శ్రుతి కలుపుతున్నాడు. (కుడి రెండుచిత్రాలు)



# స్నేహాన్ని పెంపొందిస్తాయి కళలు



## [మాస్కోలో బొంబాయి లిటిల్ బాలే బృందానికి ఘన స్వాగతం]

ఆరవ ప్రపంచ యువజన విద్యార్థి మహోత్సవంలో ప్రదర్శన లిచ్చిన బొంబాయి 'లిటిల్ బాలే బృందం' రెండు నెలలపాటు సోవియట్ దేశంలో పర్యటించి. అనేక నాటకశాలలలోనూ, మాస్కో టెలివిషన్ కేంద్రంలోనూ ప్రదర్శనలిచ్చింది. బెర్లిన్‌కు పోయే ముందు. మాస్కో నటులు, స్వరకారులు, సంగీత శాస్త్రజ్ఞులు తమ భారత మిత్రుల గౌరవార్థం. 'వోక్స్' మందిరంలో ఘనమైన సమావేశం ఏర్పాటుచేశారు.

సమావేశానికి ముందటిరోజున ఈ బృందం ప్రదర్శించిన "రామాయణ" (ఈ బృంద నిర్మాత కీ. శే, శాంతిబర్ధన్ విరచించినది) నృత్యనాటక స్మృతులు, మాస్కో టెలివిషన్ కేంద్రం ప్రసారం చేసిన 'పంచతంత్ర' రూపక ముద్రలూ వాటిని సందర్శించిన మాస్కోవాసుల మనోఫలకాలమీద ఇప్పటికీ చెక్కుచెదరలేదు.

ప్రసిద్ధ సోవియట్ సంగీతవేత్త ప్రొఫెసర్ ఇగోర్ బెల్జా, యీ సమావేశానికి ఒకర్నొకరు పరిచయం చేసుకోవడానికి, ఒకరి అనుభవాలను మరొకరు పంచుకోవడానికి విచ్చేశామన్న మాటలలో సభికుల హృదయాన్ని ప్రతిధ్వనింప జేశా.రు



మాస్కో వాసులు, బృంద దర్శకురాలు శ్రీమతి గుల్ బర్ధన్, సంక్షిప్తంగా బృంద చరిత్రను వివరించి, నటకుల, నిర్మాతల కృషిని సమీక్షిస్తూ భారతీయ జానపద నృత్యాలకు ప్రామాణిక నృత్యరీతులకు ఒక చక్కటి అనుసంధానాన్ని కల్పించడమే బృంద లక్ష్యమని చెప్పిన అంశాలను శ్రద్ధాసక్తులతో విన్నారు.

అనేక ప్రశ్నలు అడిగారు. సోవియట్ కళాకారులు నృత్య సంగీతం ఎట్లా రచించబడుతుందో తెలుసుకోదలచారు. తమ భారతీయ మిత్రులు అతి సంక్షిప్త సంకేతాలద్వారా, ఒక్కొక్కప్పుడు దృష్టి, గొంతు భేదాలవల్లనే గాక కేవలం ఒక హస్తవిన్యాసం ద్వారా, తీవ్రమైన ఉద్వేగాన్ని, "రామాయణం" లోని తీవ్ర తాత్త్విక భావనను, అగాధ వేదనానుభూతినీ, 'పంచతంత్ర' కావ్యపు సాధు స్వాంతాన్నీ, ఎట్లా ఆ 'లిరికల్' భావనకు రూపులు కడతారో, ఎట్లా దాన్ని విశదపరుస్తారో తెలుసుకోదలచుకొన్నారు.

స్వరకారుడు విటలి గెవిక్సమన్, భారత గాయకుల అపూర్వ ప్రావీణ్యాన్ని. ముఖ్యంగా అతిపరిమిత సంఖ్యలో కొన్ని జాతీయ వాద్య విశేషాలతో సవ్వవర్ణ సమంచితమైన ఉదాత్త సంగీతాన్ని 'సింఫనీ ఆర్కెస్ట్రా'లా ఎట్లా సృష్టించగలరో వివరించారు. లియొనిద్ సెనిమెవెర్, విశిష్టమైన భారతీయ సంగీతం ప్రపంచ ప్రజలందరికీ గ్రాహ్యం కాగలుగుటకు అనువుగా, చేరువగా అందుబాటులోకి రావడానికి వీలుగా భారత మిత్రులకు. వీలయినంతవరకు యూరోపియన్ సంకేతాలను (నొటేషన్) ఉపయోగించవలసినదన్న సలహా ఇచ్చాడు.

భారతీయ కళాకారులు మాస్కోలో చూచిన, ఛెయికొవ్‌స్కీ నృత్య నాటకం 'హంస సరస్సును' ఎంతో ప్రశంసించారు. "వాస్తవానికి మీ నృత్య. నాటకం అనుకరింప శక్యం కాద"న్నారు బృంద నిర్మాత అప్పుని. భారతీయ ఇతివృత్తాన్ని ఆధారం చేసుకొని ఒక నృత్య రూపకాన్ని విరచించాలన్న సంకల్పం తమకున్నట్టు మాస్కో కళాకారులు తమ అతిథులకు చెప్పారు. "దీనికి నిజానికి మీ సంపూర్ణ సహకారంకావాలి" అని గట్టిగాచెప్పారు తమ అతిథులకు.

"మంచిది. అట్లాగైతే మా బొంబాయి రండి" అని సోవియట్ నృత్య బృందకారుల నుద్దేశించి చెబుతూ "అక్కడికొస్తే మీకు మేము చేయగలిగినదంతా చేసి చూపిస్తాము" అన్నారు శ్రీమతి బర్ధన్.

వీడ్కోలుకు ముందుగా ఆతిథేయులు అతిథులకు రష్యన్ సంగీత రికార్డులను, అతిథులు ఆతిథేయులకు భారతీయ సంగీత రికార్డులను బహూకరించడం జరిగింది.

# "స్పుత్నిక్‌లు"

వార్తాపత్రికల్లో యిదివరకే ప్రకటించబడిన ప్రకారం, అంతర్జాతీయ భూభౌతిక సంవత్సరం కార్యక్రమం క్రింద కొనసాగుతున్న పరిశోధనల ననుసరించి సోవియట్ దేశం నవంబరు 3వ తేదిన తన రెండవ స్పుత్నిక్‌ను రోదసిలోకి పంపింది. సోవియట్ విజ్ఞాన శాస్త్రానికి ఇది మరొక కొత్త ఘన విజయం. విజ్ఞాన శాస్త్రవేత్తలు, ఇంజినీర్లు, సాంకేతిక నిపుణులు, ఫ్యాక్టరీ కార్మికులతో కూడిన ఒక పెద్ద జట్టుయొక్క తీవ్రము, ఫలవంతము అయిన కృషిఫలితంగా మొదటి స్పుత్నిక్ కంటే ఆరింతలు ఎక్కువ బరువు, అనగా మొత్తం 508.3 కిలో గ్రాముల బరువుగల స్పుత్నిక్ తయారు చేయబడి, అంతరిక్షంలో ఒక కక్ష్యలోకి ఎగురవేయబడింది. ఈ కక్ష్య మొదటి స్పుత్నిక్ కక్ష్య కంటే భూతలంనుండి ఎక్కువ దూరంలో వున్నది.



అఖిల సోవియట్ దేశ పారిశ్రామిక ప్రదర్శన శాస్త్ర విజ్ఞాన విభాగంలో పెట్టబడిన మొదటి స్పుత్నిక్ నమూనా

రెండవ స్పుత్నిక్‌లో పరిశోధనలు విస్తృతంగా కొనసాగించడానికి అవసరమైన వివిధరకాల వైజ్ఞానిక పరికరాలు అమర్చబడ్డాయి. అందులో సౌరవర్ణ పటలంయొక్క కాస్మిక్ కిరణపు సారాన్ని, అల్ట్రావైలెట్, ఎక్స్‌రే మండలాలనూ పరిశోధించే పరికరాలు, గాలిచొరకుండా బిగించిన ఒక చిన్న అరలో వుంచబడిన ఒక పరిశోధక జంతువు (కుక్క) పరిగ్రహింపబడిన సమాచారాన్ని భూమిమీది కేంద్రాలకు పంపించే రేడియో టెలీ మీటరింగ్ పరికరాలు, రేడియో ప్రసారక యంత్రాలు, అవసరమైనన్ని ఎలక్ట్రిక్ బ్యాటరీలువున్నాయి.

## స్పుత్నిక్ కక్ష్య, దాని పరిభ్రమణ

రెండవ స్పుత్నిక్ అనేక అంచెల రాకెట్ సహాయంతో దాని కక్ష్యలోకి యెగురవేయబడింది. భూతలం నుండి యెగురవేయబడిన క్రమంలో రాకెట్ భూమినుండి కొన్ని వందల కిలోమీటర్ల ఎత్తుకు పోయి చివరి అంచెలో భూమికి సమానాంతర రేఖకు మళ్ళి సెకెండుకు 8,000 మీటర్లకంటే యెక్కువ వేగంతో పరిభ్రమిస్తూ కృత్రిమ ఉపగ్రహమయింది. కక్ష్యలోకి యెగురవేయబడుతున్నప్పుడు రాకెట్ యొక్క టాంకులోని ఇంధనం వ్యయమయిపోయింది, ఇంజను ఖాళి పోయింది. పైకి యెగురకొట్టబడినప్పుడు వేగంలో లభ్యమైన శక్తితోనే ఇంకా కదలసాగింది. ఒక స్థిరమైన యెత్తులో వర్తులాకారపు కక్ష్యలో స్పుత్నిక్ పరిభ్రమించడానికి అవసరమైన ఆవేగానికంటే యెక్కువ వేగం రాకెట్‌కు చివరి అంచెలో కల్పింపబడింది. తత్ఫలితంగా స్పుత్నిక్ వర్తులాకారపు కక్ష్యలోగాక, అండాకారపు కక్ష్యలో పరిభ్రమిస్తున్నది. ఆ అండాకారపు కక్ష్యలోని అత్యున్నత స్థాయి 1,700 కిలోమీటర్ల ఎత్తున, అనగా మొదటి స్పుత్నిక్ దానికంటే రెండంతలు యెత్తున, వున్నది. రెండవ స్పుత్నిక్ కక్ష్యయొక్క బృహత్ అర్ధాక్షము మొదటి స్పుత్నిక్ కక్ష్యయొక్క బృహత్ అర్ధాక్షంకంటే పెద్దదిగావడం మూలాన భూమిచుట్టు తిరిగి వచ్చే కాలంగూడా ఎక్కువ పడుతున్నది. పరిభ్రమణ ప్రారంభమయిన మొదట్లో ఒకసారి భూమిచుట్టూ తిరిగి రావడానికి 103.7 నిముషాలు పడుతూ వచ్చింది.

భూమిచుట్టూ పరిభ్రమించే కాలపరిమితి ఎక్కువ కావడం మూలాన రెండవ స్పుత్నిక్ 24 గంటల్లో 14 ప్రదక్షిణలను మాత్రమే చేస్తున్నది. మొదటి స్పుత్నిక్ ప్రారంభపు రోజులో 24 గంటల్లో 15 ప్రదక్షిణలను చేస్తూ వచ్చింది. సూర్యుని చుట్టూ భూమి పరిభ్రమిస్తున్న సమయంలో దాని చుట్టూ రేఖాంశ మార్గంలో పరిభ్రమించే సమయంలో వచ్చే స్ఖాలిత్యం మొదటి స్పుత్నిక్ విషయంలో కంటే రెండవ స్పుత్నిక్ విషయంలో సుమారు పదిహేనింట ఒక భాగం ఎక్కువగా వున్నది. ఈ విధంగానే రెండు పరిభ్రమణా వలయాల మధ్య గల తేడాకూడా పెరిగింది.

భూమియొక్క వాతావరణ వత్తిడి భారం స్పుత్నిక్ మీదపడి, దాని కక్ష్య యొక్క ప్రమాణము, రూపము మారుతున్నాయి. భూతలానికి చాలా యెత్తున వాతావరణం పలుచగా వుంటుంది గాబట్టి స్పుత్నిక్‌పై పడే ఆ వత్తిడి యేమంత ఎక్కువగా వుండదు. అందువల్ల కక్ష్య కొలతల్లో మార్పులు చాలా నింపాదిగా కలుగుతాయి. భూతలం నుండి ఎక్కువ స్థాయికి పోతున్నకొద్ది వాతావరణపు సాంద్రత తగ్గిపోతుంది గాబట్టి, స్పుత్నిక్ భూమికి సమీపంగా వచ్చినప్పుడు మాత్రమే యీ వత్తిడి ప్రభావం కలుగుతుంది. భూపరిభ్రమణ వలయంలో అత్యంత ఉన్నతస్థాయికి వెళ్ళినప్పుడు స్పుత్నిక్ దాదాపు భూ వాతావరణ మండలం వెలుపలికి, అనగా 1,000 కిలో మీటర్లకు చేరుకొంటుందని సైద్ధాంతికంగా అంచనా వేయబడుతున్నది.

స్పుత్నిక్ వేగం తగ్గడం వాతావరణపు సాంద్రతపైననేగాక, స్పుత్నిక్ యొక్క స్వరూపంపైనా, దాని బరువుకు, పరిచ్ఛేద విస్తీర్ణానికీ (మధ్యభాగపు బరువు) గల నిష్పత్తిపైనా ఆధారపడి వుంటుంది. ఇతర విస్తీర్ణంలోకంటే మధ్య బరువు ఎక్కువగా వుంటే వేగంలో కలిగే పతనం తక్కువగా వుంటుంది.

ప్రారంభంలో ఒకేకక్ష్యలోకి విడువబడిన రెండు స్పుత్నిక్‌లు,

(మిగత 38వ పుటలో)



రెడ్ స్క్వేర్లోని ఉత్సవ దృశ్యం

# సోవియట్ దేశంలో మహత్తర అక్టోబరు విప్లవ 40వ వార్షికోత్సవం



ఫెర్గానాలోని ఉత్సవపు దృశ్య భాగం (ఉజ్బెక్ రిపబ్లిక్)



జోళ్ళ కర్మాగార కార్మికులు. విలినియస్ వీధుల గుండా ఊరేగింపు పోతున్నప్పుడు (లిథుయేనియన్ రిపబ్లిక్), ఊరేగింపులో చేరుతున్న దృశ్యం



మాస్కో రక్షక దళ సైనిక విన్యాసాలలో రెడ్ స్క్వేర్ గుండా ఊరేగించబడుతున్న రాకెట్ ఆయుధాలు

కీవ్ శ్రామిక ప్రజల ఊరేగింపు, క్రెషతిక్ వీధిగుండా పోతున్న దృశ్యం (ఉక్రేనియన్ రిపబ్లిక్)





కెమెన్నీ మోస్త (వంతెన) మీదుగా తీయబడి మాస్కో క్రెమ్లిన్ సంధ్యా దృశ్యం





## భారత దేశంలో మహత్తర అక్టోబరు విప్లవ 40వ వార్షికోత్సవం



రష్యాలో జరిగిన మహత్తర అక్టోబరు విప్లవ 40వ వార్షికోత్సవం, భారత దేశమంతటా విస్తృతంగా జరుపబడింది. ఉత్సవ సందర్భంగా అనేక బహిరంగ సమావేశాలు, ప్రదర్శనాలు, సినీ చిత్ర ప్రదర్శనలు, ఢిల్లీ, కలకత్తా, మద్రాసు, పాట్నా, పాటియాల మొదలైన భారతీయ నగరాలలోను, పట్టణాలలోను ఏర్పాటుచేయబడ్డాయి.

ఛాయాచిత్రాలు: బొంబాయిలో జరిగిన సమావేశ దృశ్యాలు (కుడి) మైసూరులో (దిగువ)







భారతీయ ప్రతినిధివర్గ సభ్యులు, సోవియట్ దేశ వ్యవసాయ ప్రదర్శనంలో

*

# గోమాతలు

గౌరవనీయ కర్షకులకు సోవియట్ గ్రామ
పనికత్తె అనుభవాలు

< పి. వొయిత్సెఖోవ్‌స్కీ >

చిత్రాన్నిబట్టి, సోవియట్ దేశ వ్యవసాయ ప్రదర్శన పశు విభాగంలో, ఉక్రెయిన్‌కు చెందిన పాలపనికత్తె, మారియా సెవ్ చెంకో చెబుతున్న విషయాలను, భారతీయ ప్రతినిధులు ఎంత శ్రద్ధగా వింటున్నారో తెలుసుకోవచ్చు. క్షీర సేకరణలో ఉన్నత ప్రమాణాలను సాధించిన ఈ నిపుణురాలైన పశుపాలకురాలు చెప్పే విషయాలను వినాలని ఏ రైతైనా ఉత్సాహ పడతాడు. తను సాకే ప్రతి ఎనిమిది ఆవులమంద నుంచీ ఆవిడ, 8,000 కిలోగ్రాముల పాలు పిండుతుంది. అన్నిటికంటే ముఖ్య విషయం, "రెజ్వయా" (ప్రిస్కీ) అన్న, ఆ ఆవులలో ఒకటి, రోజూ 13 లిటర్ల సమృద్ధమైన పాలను యిస్తుంది.

నేను మారియాను, ఆమె పాలను అంతగా ఎట్లా రాబట్ట గలుగుతున్నదో, ఇటువంటి ఉన్నత ప్రమాణాలను ఎట్లా సాధించ గలుగుతున్నదో ఆ రహస్యం చెప్పమని అడిగాను.

"నాకు రహస్యాలు అనేవి ఏవీలేవు." అన్నది. "పశుపాలనలో వున్న ప్రతివ్యక్తికీ సుపరిచితమైన సూత్రాలు మూడింటినీ నేను పాటిస్తాను. నా ఆవులకు బాగా మేత వేస్తాను, వాటివాటి ప్రత్యేకాభిరుచులను గమనిస్తాను, వాటిపట్ల ఎంతో శ్రద్ధ వహిస్తాను, చిన్న ఆవుల పాలు పితికేటప్పుడు ఎప్పుడూ ఒక క్రమాన్ని అనుసరిస్తాను."

"మీరు మంచిమేత అనుకునేది ఏది?"

"మా నాన్నగారు ఎప్పుడూ చెప్పేవారు: ఆవు యిచ్చే పాలు దానికి పెట్టే మేపునుబట్టి వుంటాయని. ఆయన చెప్పింది అక్షరాలా నిజం. బాగా గోవును మేపితే మరిన్ని పాలిస్తుంది. దానికిచ్చేది సరియైన ఆహారంగా వుండాలి. లేకపోతే అది నీ లాభాన్నేమింగేస్తుంది.

"నేను నా ఆవులకు పుష్టిగా మేత వేస్తాను. పాలు ఎంత ఎక్కువగా అవి ఇస్తుంటే, వాటి మేపు ఆ నిష్పత్తిలో పెంచుతుంటాను. పాలు ఒక్కచుక్క పడిపోయినాసరే, దానికి తగినట్టు మేపు తగ్గించి పెడతాను. ద్రవాహారాన్ని, బాగా క్షీరాన్ని అభివృద్ధిచేసే, శీతకాలం నిలవచేసిన ఆవశ్యకమైన చొప్పను వేస్తాను. వేసంగిలో అవి బీళ్ళలో మేస్తాయి. శీతకాలంలో ఒక్కొక్కదానికి వేసే మేత, ఎనిమిదినుంచి పది కిలోగ్రాములు బాగా ఆవిరిపట్టిన చొప్ప, తవుడు దీనికితోడు 35 కిలోగ్రాముల దంటు అయిదునుంచి పది కిలోగ్రాములు గొడ్లకువేసే దుంపలు పెడతాను. తవుడు, పిట్టు పెట్టేటప్పుడు అవి యిస్తున్న పాలను పరిగణనలోనికి తీసుకుంటాను. రోజుకు ఒక ఆవు పది కిలోగ్రాముల పాలిస్తే, 100 గ్రాములు తవుడు వేస్తాను. 15 కిలోగ్రాములకు పైన పాలిచ్చే ప్రతి ఆవుకూ 150 గ్రాముల తవుడు వేస్తాను. ఈ పద్ధతిని అనుసరించి వాటి మేపకం క్రమంగా వుండేట్టు చూస్తాను."

"మీరు పాలుతీసే పద్ధతులు ఏమిటి?"

"పశువుల పట్ల ప్రేమగా వుంటూ, వాటిని గోముగాచూస్తూ, జాగ్రత్త వహించడం ఎంతో అవసరమని నేను మొట్టమొదట భావిస్తాను. నేను మాట్లాడినప్పుడు భారతీయులు, వారికి ఆవులంటే ఎంతో గౌరవమని నాతో చెప్పారు. అది ఎంతో మంచిదని నా నమ్మకం. నేను పశువుల్ని ప్రాణపదంగా ప్రేమిస్తాను, అంతేగాదు నా సహచర పశుపాలకులకు కూడా వాటిని ప్రేమించేట్టు శిక్షణ నిస్తాను.

"నా ఆవు 'రెజ్వయా,'ను తీసుకోండి, అది గరిష్ట ప్రమాణాలలో పాలను యిస్తున్నది. అది, ఈనిన రోజులలో ఎట్లావుండేది? దగ్గరకు రానిచ్చేదికాదు. ఆ విషయాన్ని నేను బాగా గుర్తుంచుకొని, దాన్ని ఎంతో లాలనగా చూచేదాన్ని. పొదుగు చల్లగా నిమిరేదాన్ని.

మొదలుమొదలు పాలుతీసేటప్పుడు దాన్తో ఎంతో చక్కగా వీపు తడివి మాట్లాడేదాన్ని. దూడ పాలు కుడిచిన తర్వాత కూడా ఒక రకంగా వుండేది. దాన్ని పట్టకరావడం బహు కష్టమనిపించేది. అయినా ఓర్పుతో దారికి తెచ్చాను. ఎంత సహించి, ఎంతగాఢంగా దాన్ని అభిమానించానో చెప్పలేను. ఇప్పుడు పాలు పిండడం, దానితోటి మొదలుపెట్టకపోతే దానికి ఎంతో 'కన్నెర్ర'గా వుంటుంది.

"పొదుగు బాగా ఎదగడానికి, చన్నులు దట్టంగా ఏపుగా బలపడడానికీ, ఆవు మొట్టమొదటగా ఈనిన మొదటి సంవత్సరమంతా శ్రద్ధ తీసుకుంటాను. ఈ విషయంలో పాలపనికత్తె చేయవలసిందికూడా ఎంతో వుంటుంది. తను ఎంత శ్రద్ధవహిస్తే అంత ఫలితం వుంటుంది. ఇంక పాలు వట్టిపోయిన కాలంకూడా అట్లాగే జాగ్రత్త తీసుకోవాలి. లేకుంటే మరుసటేడు పాలు పడిపోతాయి. కాగా ఇప్పటి నిర్లక్ష్యం, తరువాత తరువాత పుట్టే దూడలకు చెరుపు చేస్తుంది.

"దూడ పాలు త్రాగడానికి 45 లేక 60 రోజులకు ముందు నుంచీ కొద్ది కొద్ది వాటికివేసే తవుడు, మేత తగ్గిస్తుంటాను. పాలిచ్చేవాటికి వేసే మేతలో సుద్ద, ఉప్పు, ఎముకలపిండి, పెరిటరీ ఫాస్ఫేట్ పెడుతుంటాను. ఆవు ఎదగడానికి ఎంతో ఇవి అవసరం. ఇంక అయిదు రోజులకు పాలిస్తుందనగా, అప్పటినుంచీ ఆవుకు ఉత్త చొప్పనే పెడతాను. పాలివ్వడం ఆరంభించిన అయిదో నాటినుంచీ, లేక ఎనిమిదో నాటినుంచీ పాలను ఎక్కువచేసే ఆహారాన్నివ్వడం మొదలు పెడతాను. దీనివల్ల పొదుగులో సలుపు, మంట ఏర్పడడానికిగాని, వ్యాధులు సోకడానికిగాని వీలుండదు. చలికాలంలో సైతం కొద్ది బయట అవి గాలికి తిరిగేట్టు చూస్తాను."

"పాడి పరిశ్రమ పరిస్థితులు ఏవిధంగా వున్నాయి?"

"మా క్షీర క్షేత్రంలో, పాడిపరిశ్రమలో ఇప్పుడు ఎంతో అభివృద్ధి వచ్చింది. గడ్డి మిశ్రమం చేయడానికి యంత్రాలు ప్రవేశపెట్టబడడంవల్ల, విద్యుత్‌తో పాలుపితికే పద్ధతి వచ్చినందువల్ల, ఆవులకు కుడితిపెట్టను స్వయంచోదకపు తొట్లు, మేత తీసుకపోను, కొష్ఠాలు పరిశుభ్రం చెయ్యను కేబుల్ వేస్ ఏర్పాటయినందువల్ల ఇప్పుడు చక్కటి పరిస్థితులేర్పడ్డవనక తప్పదు.

"నిపుణులు ఉత్తమజాతి పశువులను కట్టడంలో కూడా మాకు ఎంతో తోడ్పడుతుంటారు. మా ఫారంలో భారీ అయిన చక్కటి లెబెదిన్ జాతి పశువులు ప్రజననం చేయబడుతున్నాయి."

"మీ ఆదాయాలు ఎట్లా ఉంటాయి?"

పాల పనికత్తెల రాబడి, వారు రాబట్టే పాలనుబట్టివుంటుంది. మా ప్రతిఫలం ధన, ధాన్యరూపంలో ఉంటుంది. నా నెలసరి సగటు ఆదాయం 1500 రూబుళ్ళు ఉంటుంది. మా సమిష్టిక్షేత్రం, క్షీర సేకరణలో ఉన్నత ప్రమాణాలను సాధించినందుకు నాకు ఎక్కువగా బోనసు రూపంలో పాలను యిచ్చింది.

"ఈ సంవత్సరం మారాబడి ఇంకా కొంత పెరగవచ్చు. పాడి పరిశ్రమలో ఉత్తమమైన, ఉన్నత ఫలితాలను సాధించి తలకు లభించే పాలు, మాంసం, వెన్న ప్రమాణాలలో అమెరికాను అధిగమించగలగాలన్నదే మా ప్రస్తుత లక్ష్యం."

★ ● ★

## మొక్కజొన్నునుంచి తయారు చేయబడేది ఏమిటి?

పశుగ్రాసానికి పండించబడే పంటలలో వివిధమైన వాటికి వున్న ఆహార విలువ ఈ దిగువ చిత్రంలో పొందుపరచబడింది. వీటిలో, మొక్కజొన్న విశేష ప్రయోజనకారి అన్న విషయం తేటతెల్లమవుతున్నది. సమిష్టి క్షేత్రాలలో అత్యధిక భాగం, శీతకాలం పశుగ్రాసానికని మొక్కజొన్న చొప్పను నిలువచేస్తాయి. పశువులకు గ్రాసంగా వేసే 5 కిలోగ్రాముల మొక్కజొన్న చొప్పలో, 2 కిలోగ్రాముల క్షీరాన్ని ఉత్పత్తిచేసే పదార్థాలున్నాయి. ఒక హెక్టర్ విస్తీర్ణంలో వచ్చిన మొక్కజొన్న చొప్పనుండి, 20,000 కిలోగ్రాముల పాలను ఉత్పత్తి చెయ్యవచ్చు.



# మానవుడి పాట్లు

కధకుడు:- మిఖయిల్ షొలఖోవ్ అనువాదకుడు:- శ్రీ.శ్రీ.

(22వ సంచిక తరువాయి)

సెప్టెంబర్ నెల వచ్చింది. 'కుస్ట్రిన్'కు దగ్గర్లో వున్న క్యాంప్ నుంచి, మాలో 140 మందిని బి-14 క్యాంప్‌కు పంపించారు. అది 'డ్రెస్‌డెన్'కు దగ్గర్లోనేవుంది. ఆక్యాంప్‌లో సుమారు రెండువేల మందివరకూ వుండేవారు. మేం అంతా, ఆ జర్మన్ బండరాళ్ళను తవ్వి, బద్దలుకొట్టే పనిచేసేవాళ్ళం.........ఒక్కొక్కడూ, రోజుకి, నాలుగు క్యూబిక్ మీటర్లలో పనిని పూర్తిచెయ్యాలి. విన్నావా? ఒక్కొక్కడూ; రోజుకు, నాలుగు క్యూబిక్ మీటర్లు ...అంటే రోజూ చచ్చి బతకడమన్నమాట. నిజంగానే అలాజరగటం మొదలైంది. రెండునెల్లో....మా మొటనలభై మందిలో ఏభై ఏడు గురం మిగిలాం....అంటే ఆ మిగతా ఎనభై మిగ్గురూ. ఆ రాళ్ళపాలే నన్నమాట....ఛ. మోరాన్నంతా చూస్తూ ఎలా సహించగలిగామో ఆ దేవుడికే తెలియాలి ...చెప్తే నువ్వు నమ్మవేమోకాని బ్రదర్...., చచ్చిపోయినవాళ్ళను తిప్పెట్టేటందుకు కూడా మాకు అవకాశం దొరికేదికాదు. ఇది ఇలావుండగా, రేగినపుండుమీద కారం జల్లినట్టుగా క్యాంపులో ఓ పుకారు పుట్టింది....జర్మన్లు. 'స్టాలిన్‌గ్రాడ్‌ని'పట్టుకుని సైబీరియాలోకి తరుముకెళ్తున్నారని....దాంతో వాళ్ళ పొగరు మరీ ఎక్కువైపోయింది. మమ్మల్నసలు, కళ్ళతైనా చూడనిచ్చేవారు కారు....మేం వాళ్ళకేదో, పుట్టుకనించే బానిసలైనట్టుగా చూసేవారు. ఆ వార్త వచ్చినప్పట్నించీ వాళ్ళ సంతోషానికి అంతేలేదు. రోజూ తప్పతాగటం. పోతుల్లా తిని. అరగక, అరుస్తూ, రోడ్లకోర్లా కిందపడి దొర్లటం తప్ప మరేపనీ వుండేదికాదు వాళ్ళకి.......... మా పరిస్థితి ఎప్పటికంటే ఘోరంగా తయారైందని నే వేరే చెప్పనక్కర్లేదు.

ఎప్పటిలాగే. ఆ రోజు కూడా, పని అయిన తర్వాత, సాయంత్రమయ్యేటప్పటికి గూటికి చేరుకున్నాం....ఆ పగలంతా విడవకుండా వర్షం కురుస్తూనే వుంది....అయినా మాకు తప్పదుగా. సాయంత్రమయ్యేటప్పటికి ముద్దయిపోయింది....దానికి తోడు చలి గాలికూడా ఎక్కువగా వుండటంతో, మా పరిస్థితి చెప్పలేనంత 'ఇది'గా వుంది....ఒకమూల గజగజ వణికించే చలి. మరోవైపు చెప్పలేనంత ఆకలి....మాకు సాయంకాలం తిండి పెట్టరు.. అప్పటి బాధ భరించటంకంటే, చావటమే కొన్నివేలరెట్లు నయమనిపించింది.

చిరాకుతో, తడిబట్టలుతీసి. ఒక మూలకు గిరాటువేశాను. ఆ కడుపుమంటలో నాకు తెలీకుండానే "రోజుకి నాలుగు క్యూబిక్ మీటర్లు తవ్వమంటారు కాని. మనం చావటానికి, ఒకటి గూడా ఎక్కువే" అన్నాను. అంతేసుమా నేనన్నది....మాలోనే ఒకవెధవ ....చెప్పడానికి నాకే సిగ్గేస్తోంది, నేనన్న యీ మాటలు తీసుకెళ్ళి, క్యాంప్ కమాండంట్ చెవిలో ఊదాడు.

క్యాంప్ కమాండంట్‌ని జర్మన్లు 'లాగర్ ఫురెర్' అంటారు. వాడిపేరు 'ముల్లెర్' కొంచెం పొట్టిగా, లావుగా వుంటాడు. వాడి కళ్లూ, కనుబొమ్మలు, జుట్టూ అన్నీ చూస్తే. చాలు అసహ్యం వేస్తుంది. అంతా మాడిపోయినట్టుగా వుంటుంది. వాడు మనలాగే మాట్లాడుతాడు రష్యన్‌ని. వాడు రష్యన్ మాట్లాడుతూంటే, 'ఓల్గా' ప్రాంతాల వాడేమో ననిపిస్తుంది. క్యాంప్ అంతా వాడంటే హడల్. వాడిదగ్గర ఓ లేకిటుకులున్నాయిలే ... మమ్మల్నందర్నీ క్యాంప్ బైట వరుసగా నిలబెట్టిన తర్వాత వచ్చేవాడు .... కుడిచెయ్యి



మిఖయిల్ షొలఖోవ్

వెనక్కుబెట్టుకొని, లైనుముందు నడుస్తూ, ఒక్కొక్కడి ముఖంమీద ఒకక్కబలమైన గుద్దు ఇచ్చేవాడు....అలా కొడుతున్నప్పుడు. వేళ్ళు నొప్పిపెట్టకుండా, చేతికి తోలు 'కవర్' లాటిది తొడుక్కునేవాడు.... క్యాంప్‌లో వున్నవాళ్ళందర్నీ, నాలుగు జాబితాలుగా విడదీసి, ఒక్కొక్క జాబితాకి, ఒక్కొక్కరోజు అలా చేసేవాడు వెధవ. ఒక్కరోజు కూడా తప్పకుండా చేసేవాడు....అందుకే వాడంటే అందరికీ అంత భయం. వాడలా కొట్టేముందు రోజూ నోరు నెప్పిపెట్టేవరకూ, తెగతిట్టేవాడు. ఆ తిట్టేవంతా. రష్యన్‌లోనే తిట్టేవాడు కనుక, అవేమిటో మరి, మాకు ఏమంత బాధనిపించేదికాదు. మాలోనే ఒకడు తిడుతున్నట్టుగా వుండేది....

నేనలా అన్న మరునటిరోజే, కమాండంట్ దగ్గర్నుంచి నాకు పిలుపొచ్చింది. కమాండంట్ నన్నెందుకు పిలిచాడో నేనూహించాను. అదే నా ఆఖరురోజు....అందుకే, మావాళ్ళందరికీ 'గుడ్‌బై' చెప్పి, 'గార్డు'ల వెనుక బయల్దేరా....అలా నడుస్తూ వెళ్తూంటే, ఛట్టున నా భార్యాపిల్లలు గుర్తుకొచ్చి. నామీద ఆశలు పెట్టుకున్న వాళ్ళగతి ఏమౌతుందోనని భయంతో కంపించిపోయాను. ఒక్కక్షణం చావంటే ఎందుకో భయం కలిగింది. కాని తిరిగి నాలోని ధైర్యం తలెత్తింది. చావంటే భయపడితే, శత్రువుకెంత లోకువ. ఛా. అందుకే భయపడగూడదు. వీరసైనికుడనై. ధైర్యముగా చావాలనుకున్నా....ఆదే నిశ్చయంతో కమాండంట్ గదిలో అడుగు పెట్టా. మా 'క్లబ్బు'ల్లోలాగే, ఆగది కిటికీలలో, పువ్వుల కుండీలున్నాయ్....వాటిలోని పువ్వులు మంచి అందంగా వున్నాయ్. గది మధ్యలో ఒక రౌండుటేబిలుంది. దానిచుట్టూ. 'క్యాంప్'లోని అఫీసర్లంతా కూర్చున్నారు. వాళ్ళల్లో అయిదారుగురు, అక్కడున్నవి తింటున్నారు. ఆ టేబిల్‌మీద సీసానిండా సారావుంది. ఇంకా ప్లేట్లలో, బోలెడన్ని రొట్టెలు, ఘుమఘుమలాడే మాంసం, ఆపిల్ పండ్ల ముక్కలూ వున్నాయ్. ఇంకా యేమేమో వున్నాయ్. అలాంటి

ఆహారంచూసి ఎన్నాళ్ళయిపోయిందో, నానోరూరటం మొదలెట్టింది. దానికితోడు ఘోరమైన ఆకలి....కడుపు మండిపోతూన్నా, అలాంటి ఆహారాన్ని చూస్తూ, తినలేకుండా వుండవలసివచ్చినందుకు, నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయ్....ఎలాగో కష్టపడి, నా దృష్టిని ఆ టేబుల్ నుండి తప్పించా....

నాకెదురుగుండానే కూర్చున్నాడు ముల్లెర్. వాడి వాలకం చూస్తే, తాగినట్టుగానే వున్నాడు....పిస్టల్ని ఒక చేతులోంచి మరో చేతిలోకి ఎగరేస్తూ, కొరివిదయ్యంలా, నావేపు చూస్తున్నాడు.... నేను 'అటెన్షన్'లో నుంచుని "హెర్ కమాండంట్. యుద్ధఖైదీ సొకోలావ్ని, ఆజ్ఞ శలవీయండి" అన్నా గట్టిగానే. "అరేయ్ రష్యన్ గాడిదా! నీకు నాలుగు క్యూబిక్ మీటర్లు ఎక్కువగనూ? ఔనా?" అని అరచాడు వాడు.... "హెర్ కమాండంట్....ఆ మాట నిజమే." అన్నాను ధైర్యంగా. వాడికి కోపమొచ్చినట్టుంది. "నిన్ను పూడ్చటానికి, ఒక్కగొయ్యి చాలా" అని అరచాడు పందిలాగా...."చాలా ఎక్కువ హెర్ కమాండంట్. ఇంకా మిగిలిపోతుంది" అన్నా ఏమాత్రం జడవకుండా.

వాడు లేచి అంటున్నాడు...."అంత ధైర్యంగా మాట్లాడినందుకు నీకు గౌరవనీయమైన చావునిస్తా. నేనే స్వయంగా 'షూట్' చేస్తా. ఇక్కడైతే ఛండాలమౌతుంది. బైటకునడు...." "మీ యిష్టం" అన్నాను నేను....వాడలాగే నుంచుని ఒక నిమిషం ఆలోచించాడు. తర్వాత, ఒక గ్లాసునిండా సారాపోసాడు. ఒక రొట్టె ముక్కమీద మాంసం కొంత వుంచాడు, "చచ్చేముందు, మా జయంకోరి ఇవి తిను"అని అంటూ అవన్నీ నాకందించాడు....అవి తీసుకునేవాణ్ని. కాని వాడన్నమాటలు వినగానే, నాలోనే నన్నెవరో నరుకుతున్నట్టయింది ..నేను, ఒక రష్యన్ సైనికుణ్ణి ...జర్మన్ విజయం కోరటమా, అది నా ప్రాణం పోయినా జరగని పని....

వాడందించినవి టేబిల్‌మీద పెట్టేస్తూ, "మీ దయకు చాలా 'థాంక్స్' హెర్ కమాండంట్ నేను తాగను"అన్నాను. వాడు నవ్వుతూ "మా జయం కోరి తాగనన్నమాట. సరే పోన్లే. నీ చావు కోరే తాగు"అన్నాడు. అలాఅయితే నాకేంపోయింది. "నా ఆత్మశాంతికోసం"అంటూ, ఆ సారాని రెండుగుక్కల్లో తాగేశా. కాని రొట్టె మటుకు ముట్టుకోలేదు. చేత్తో పెదవుల్ని తుడుచుకుని "నేను రెడీ హెర్ కమాండంట్....నడవండి బైటకు వెళ్దాం" అన్నాను తడుముకోకుండా.

వాడు నాకళ్ళల్లోకి తీక్షణంగా చూస్తూ "చచ్చేముందు కాస్త రొట్టె తిను" అన్నాడు. కాని "ఒకగ్లాసు తాగినవెంటనే, నేను తినను"అన్నాను. వాడు ఇంకోగ్లాసుడు పోసాడు. అది తాగాను. కాని రొట్టె తినలేను. నా ఉద్దేశమేమిటంటే, చచ్చేముందు బాగా తాగితే, ఆ మైకంలో హాయిగా చావొచ్చని. అందుకని అలాగే నిలబడ్డా. క్షణం తర్వాత "అదేం తినవేం? అరే తినరా మొద్దు పీనుగా, సిగ్గుపడకు"అన్నాడు వాడు అదోలాచూస్తూ. "క్షమించండి హెర్ కమాండంట్....నేను రెండోగ్లాసుతర్వాత కూడా తినను" అన్నాను నెమ్మదిగా....దాంతో వాడు పగలబడినవ్వటం మొదలెట్టాడు....నవ్వుతూనే, నేనన్నది తక్కినవాళ్ళకి, వాళ్ళ భాషలో చెప్పినట్టున్నాడు....వాళ్లు కూడా విరగబడి నవ్వటం మొదలెట్టారు. వాళ్ళ నవ్వులతో ఆ గదంతా మార్మోగింది.

కమాండంట్ మూడోసారి సారా పోశాడు. అదీ తాగేసి, చిన్న రొట్టెముక్క మాత్రం తిన్నా. ఎంత ప్రాణంపోయే సమయంలోనైనా సరే దిగజారిపోకుండా, రష్యను తమ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొంటారని ఆ వెధవలకి చూపించాలనే అలా చేసా. అలా చేయగలిగినందుకు నిజంగా గర్వించాను కూడా.

మరో నిమిషం తర్వాత, కమాండంట్, టేబిల్ వెనకనుంచి నా దగ్గరకు వచ్చాడు "చూడు సొకొలోవ్....నువ్వు నిజమైన రష్యన్ సైనికుడివి, నువ్వు వీర సైనికుడివి....నేనూ సైనికుణ్నే....శత్రువైనా సరే చేవవుంటే, నేను మెచ్చుకుంటా....అందుకని నిన్ను 'షూట్' చెయ్యను. మాకేం మా సైన్యాలు 'స్టాలిన్‌గ్రాడ్'ని పట్టుకుని, 'ఓల్గా'ని సమీపించాయ్....ఆ సంతోషంలో, నీ ప్రాణం దానం చేస్తున్నా...ఇదిగో....నీ ధైర్యానికివి తీసుకుని వెళ్ళు"అంటూ వాడు, నాకొక రొట్టె, కొంచం మాంసం ఇచ్చాడు....

నా ఆనందానికి పట్టపగాలేవు. ఆ సంతోషంలోనే, ఆ రొట్టెను, నా గుండెకదుముకుని, ఒక చేత్తో మాంసం పట్టుకుని, 'థేంక్స్' చెప్పటంకూడా మర్చిపోయి, వెనక్కు తిరిగా....తిరిగి అనుకోని విధంగానే చావు తప్పినందుకు ఆశ్చర్యపోతూ, ఆ గదినుండి బైట పడ్డా....

బైట నడుస్తున్నానన్న మాటేకాని, కళ్ళు తిరగటంవల్ల, నాకేవీ సరిగా కనబడటం లేదు. నేను మా గుడిసె దగ్గరికెళ్ళేసరికి, నాలోని శక్తి పూర్తిగా అయిపోయింది. గుడిసెలోకి వెళ్ళిన కొద్ది క్షణాల్లోనే పడిపోయా....అంతే....తర్వాత ఎప్పుడో మెలకువ వచ్చింది....మా కుర్రాళ్ళంతా నా చుట్టుముట్టారు....అప్పటికింకా చీకటిగానే వుంది. ఏం జరిగిందో చెప్పమని వాళ్ళంతా నన్ను కొరుక్కుతిన్నారు....జరిగినదంతా పూస గుచ్చినట్టు చెప్పా. చెప్పినంతసేపూ, అందరూ ఆశ్చర్యంతో, చలనం లేకుండా బొమ్మల్లా వుండిపోయారు. తర్వాత ఒకడు 'రొట్టెను పంచేదెట్లా' అని అడిగాడు....'అందరికీ సమాన భాగాలు' అని చెప్పా....వెలుగు వచ్చే వరకూ, ఆ భాగోతమే చెప్పుకుంటూ కూర్చున్నాం....తర్వాత, ఆ రొట్టెను, మాంసాన్ని కోశాం....ఒక్కొక్కడికీ, అగ్గిపెట్టెంత రొట్టె ముక్క, పెదవులకంటుకునేంత మాంసం వచ్చాయ్....అయినా మేం అంతా సంతృప్తి చెందాం....

వెంటనే కొన్నాళ్ళ తర్వాత, మాలో బలమైన 300 మందిని, ఒక కాలువ త్రవ్వటానికి పంపించారు. అక్కడినుంచి "రూహర్", గనుల్లో పనిచేయటానికి పంపించారు. 1944 వరకూ నేను అక్కడే వున్నా. ఈ లోపున జర్మనీలో కొంతభాగం, మన వాళ్ళు జయించారు. దాంతో, మా ఖైదీల నందర్నీ బాధపెట్టడం తగ్గించారు. ఒక రోజున మా అందర్నీ వరసగా నిలబెట్టి, యుద్ధంలోగాని, యుద్ధానికి ముందుగాని, డ్రైవరుగా పనిచేసినవాళ్ళు ముందుకు రమ్మని 'లెఫ్టినెంట్' పిలిచాడు. అప్పుడు నాతోబాటు ఏడుగురం ముందుకొచ్చాం. మమ్మల్ని వెంటనే, 'పోట్స్‌డామ్'కి తీసుకెళ్ళి, అక్కడనుంచి, అందర్నీ తలోచోటుకి పంపించారు. 'టోడ్ట్' శాఖలో పనిచేయటానికి నన్ను పంపించారు....రోడ్లు వేయటం మొదలగు రక్షణకు సంబంధించిన పన్లు చేయటం ఆ శాఖ పని.

ఇంజనీర్లందరి మీదున్న మేజర్ దగ్గర డ్రైవర్‌గా పనిచేశా. వాడు పొట్టిగా వుంటాడు....పెద్దబానంత బొజ్జ. చాకలి మూటంత వీపు చూస్తూంటే, వాడొక గున్న ఏనుగులా వుంటాడు. వాడి గడ్డం మూడు భాగాలుగా చీలి, మూడుగడ్డాలున్నట్టు కనిపిస్తుంది. అనపకాయలాటి వాడి మెడ ముడతలుపడి చూడటానికి అసహ్యంగా వుంటుంది.

ఎలాలేకన్నా, వంద కిలోగ్రాములకంటే ఎక్కువ బరువే వుంటాడు. ఇంక వాడు తినటానికి కూర్చున్నాడంటే గంటలతరబడి తింటాడు. అసలు ఎప్పుడూ ఏదో ఒకటి నములుతూనే వుంటాడు....ప్లాస్కులో పోసుకుని వుంచుతాడు బ్రాందీ. అది, అస్తమానం తాగుతూనే వుంటాడు. రోడ్డుమీదపోతూ, ఎక్కడైనా ఆపమని, రొట్టె, మాంసం, తిని, బ్రాందీ బాగాతాగేసి, పొరపాటున ఎప్పుడైనా దయ గలిగితే, కుక్కకు పారేసినట్టు, ఒక రొట్టెముక్క నాకు గిరాటు వేస్తాడు. ఎప్పుడూ నా చేతికిచ్చిన పాపాన పోలేదు. అలా చేతికిస్తే, వాడి గౌరవానికి లోటేమో! పోన్లే. ఎలా అయితేనేం, అక్కడ నాకు కొంచం మంచితిండే దొరకటంవల్ల, నాకుకూడా కండపట్టడం మొదలైంది. కొన్నాళ్ళలోనే, తిరిగి నా బలం నాకు చేరింది.

ఆ విధంగా వాడిదగ్గర రెండు వారాలు 'డ్రైవ్' చేశాను. ఆ రెండువారాల్లో, 'పోట్స్‌డామ్'కు 'బెర్లిన్'కు మధ్య చాలా సార్లే తిరిగాం, తర్వాత, ఆ మేజర్ని, రక్షణ సౌకర్యాలు కలిగించమని, 'ఫ్రంటు లైన్'కి పంపించారు....అంటే మనవాళ్ళకు చాలా దగ్గర్లో వున్నానన్నమాట. అప్పుడు చూడు నా అవస్థ, రాత్రుళ్ళు నిద్రపట్టేది గాదు. మనవాళ్ళదగ్గరకు ఎలాగా పారిపోవటమని....

తర్వాత, ఒకసారి మేం, 'పోలోట్స్క్' పట్టణానికి వెళ్ళాం. రెండు సంవత్సరాల తర్వాత, మొట్టమొదటిసారిగా అక్కడ, మన వాళ్ళ సైన్యనినాదం విన్నాను. అప్పుడు నా ఆరాటం ఎంతగా వుండి వుంటుందో నువ్వే ఊహించుకో....'ఇరీనా'ని విడిచిపెట్టినప్పుడు కూడా నేనంత ఆరాటపడలేదనే చెప్పాలి. 'పోలోట్స్క్' పట్టణానికి, సరిగ్గా 18 కిలోమీటర్ల దూరంలోనే యుద్ధం జరుగుతోంది. ఎప్పుడు ఉపద్రవం ముంచుకొస్తుందో అని జర్మనీ వాళ్ళంతా భయపడి ఛస్తున్నారు....ప్రాణాలుగ్గబెట్టుకుని కాలం గడుపుతున్నారు....మా బొజ్జ మేజర్‌గాడుకూడా హడలిపోతున్నాడు. పగలంతా తిరగటం, ఎలా ఎలా పనిచెయ్యాలో అందరికీ చెప్పడం, రాత్రంతా ఇంటిదగ్గర కూర్చుని తెగతాగటం వాడిపని....వాడు ఎడతెరపి లేకుండా తాగుతుంటటం వల్ల, తనేం చెప్తున్నదీ తనకే తెలీటంలేదు పారిపోవటానికింతకన్నా మంచి అవకాశం దొరుకుతుందా? నే నొక్కణ్ణీ పారిపోతే ఏం వుంది? మా 'బొజ్జగాణ్ణి' కూడా తీసికెళ్తేనే వుంది మజా. వాడు మనవాళ్ళకు బాగా ఉపయోగిస్తాడు....

పాడైపోయిన వాటిల్లోంచి, ఒక మాంచి ఇనపకడ్డీ ఒకటి తీసుకున్నా. దానితో వాణ్ణికొడితే, రక్తం అంటుకోకుండా, దానికి గుడ్డ చుట్టేశా. టెలిఫోన్ వైర్ చుట్టలోంచి, కొంత వైర్ తీసా, అవన్నీ తీసి ముందు నేను కూర్చునే సీటు కింద పెట్టేశాను, నేను పారిపోవటానికి రెండురోజులు ముందు, నేను ఇంటికొచ్చేస్తున్నప్పుడు, దార్లో, బాగాతాగేసి వెళ్తున్న ఒక జర్మన్‌ని చూశా. వెంటనే, వాణ్ణి, ఆ పక్కనున్న పాడుబడ్డ బంగళాలోకి తీసుకపోయి, వాడి 'యూనిఫారం' టోపీ తీసేసి, నా సీటుక్రింద భద్రంగా దాచేశా. దీనితో నేను పూర్తిగా రెడీ అయిపోయానన్నమాట.

అది జూన్ నెల. ఆ రోజు 29వ తారీఖు. ఆ ప్రొద్దున్న, 'త్రోసిట్సా' వైపు పోనిమ్మని, మా మేజర్ చెప్పాడు. అక్కడ జరుగుతున్న రక్షణకు సంబంధించిన పనులకు బాధ్యుడతను ...సరే మేం బయల్దేరాం. మేజర్ వెనకసీట్లో కూర్చుని, తాగిన మైకంలో, కునికిపాట్లు పడుతున్నాడు....నేను ముందుసీట్లో కూర్చుని, కారుని అతివేగంగా నడుపుతున్నాను....పట్నం దాటగానే 'స్పీడు' తగ్గించి, కొంతదూరం పోయాక కారు నాపాను. కిందకు దిగి చుట్టూ చూస్తే, మాకు వెనకాల, చాలాదూరంలో, రెండు లారీలు నెమ్మదిగా వస్తూ కన్పించాయ్....వెంటనే ఇనుపకడ్డీ తీసుకుని, వెనక తలుపు బార్లా తెరిచాను. వాడు గురకపెట్టి, సుఖంగా నిద్రపోతున్నాడు. వాడికి ప్రక్కలో పెళ్ళాంవున్నట్టే వుందేమో! సరే, ఇనుపకడ్డీతో, వాడి కణతమీద ఒకటి మోదా. ఎందుకైనా మంచిదని ఇంకో దెబ్బకూడా కొట్టా....వాణ్ణి చంపటం నాకిష్టంలేదు. ఎందుకంటే, వాణ్ణి బ్రతికుండగా అక్కడికి తీసికెళ్తే, మనవాళ్ళకి బాగా ఉపయోగిస్తాడు.... సీటు వెనకాల, ఒక కడ్డీపడేసి, దానికి వాడి మెడని, టెలిఫోన్ వైర్‌తో గట్టిగా కట్టేశాను. ఎందుకంటే, నేను 'స్పీడ్'గా 'డ్రైవ్' చేస్తే, వాడు కిందకు జారిపోకుండా వుండాలని....జర్మన్ 'యూనిఫాం' తొడుక్కుని, ఆ టోపీ పెట్టుకుని, మీట తొక్కాను: యుద్ధభూమివైపు దూసుకపోయింది మా కారు.

జర్మన్ 'ఫ్రంట్ లైన్' లోకి వచ్చేసింది మాకారు. అక్కడ సబ్ మిషన్ గన్నర్స్ ఒక గోతిలోవుండి షూట్ చేస్తున్నారు...నా దగ్గర ఒక మేజరున్నాడని వాళ్ళు చూడాలని కావలనే, స్పీడు తగ్గించా—వాళ్ళను దాటిపోయింది కారు, అలా వెళ్ళటం ప్రమాదకరం అని వాళ్ళరుస్తున్నారు. అదెక్కడా వినిపించుకోలేదు. 'స్పీడ్' హెచ్చించా—నలభై, యాభై, అరవై, డెబ్భై, ఎనభై మైళ్ళ స్పీడుతో 'రాకెట్' లాగా దూసుకుపోతోంది మా కారు—ఆ జర్మనులకు నేను చేస్తున్నదేంటో అర్థం అయి, కాల్పులు మొదలెట్టేసరికీ, నేను ఎవరికీచెందని భూమిలోకి వచ్చేశాను. అయినా వాళ్ళు కాల్పులు మానలేదు. దానికితోడు, మా కారునిచూసి గాభరాపడి, ముందునుంచి, మనవాళ్ళకూడా కాల్పులు చేయటం మొదలెట్టారు.

నాలుగు బులెట్లు రేడియేటర్లో దూరిపోయాయ్. దగ్గర్లోనే చెట్లు. అక్కడే చిన్నచెరువు కనిపిస్తే, చెట్లలోకి పోనిచ్చా. ఆ చెట్లలోంచి, మనవాళ్లు; మా వైపుకు పరుగెత్తుకొచ్చారు. చెట్లలోకి వెళ్ళగానే, కారు తలుపుతీసి క్రిందపడిపోయా. మనభూమి తగలగానే, నాకు కలిగిన ఆనందం ఎంతో నేను చెప్పలేను.

ఒక యువక సైనికుడు నాదగ్గరకొచ్చాడు. అతన్ని అంతకు ముందెప్పుడూ నేను చూడలేదు. "ఓహో జర్మన్ దయ్యమా? ఏం! దారితప్పి వచ్చావా?" అని ఇంకా ఏమేమో అంటున్నాడు. నా జర్మన్ 'యూనిఫాం' చింపేసి, టోపీ అవతలపారేసి "తమ్ముడూ! 'ఒరునెజ్'లో పుట్టిపెరిగిన నేను జర్మన్ దెయ్యాన్నెట్లా అవుతాను బాబూ? చూడు నన్ను యుద్ధంలో ఖైదీగా పట్టుకపోయారు. ఆ కార్లో వుందొక జర్మన్‌దెయ్యం....వెళ్ళి వాణ్ణి పట్టుకో....ఈ విషయాన్ని మీ కమాండర్‌కి తెలియచేయ్" అంటూ నా'పిస్టల్'ని అతని ఆధీనం చేశా. ఆ సాయంత్రం, 'డివిజన్' కర్నల్ దగ్గరకు వెళ్ళేలోపల, ఒక్కొక్కళ్ళనే, చాలమందిని కల్సుకోవాల్సివచ్చింది.... వెళ్ళగానే కొన్ని ప్రశ్నలు వేశారు, తర్వాత, స్నానాలగదికి తీసుకెళ్ళి మంచి భోజనంపెట్టి, కొత్త 'యూనిఫారం'ఇచ్చారు. అందుకనే సాయంత్రం, కర్నల్ దగ్గరకు, శుభ్రంగానే వెళ్ళగలిగా.

నేను కర్నల్ గదిలోకి వెళ్ళగానే, కర్నలే స్వయంగా టేబిల్ దగ్గర్నుంచి లేచి, తిన్నగా నాదగ్గరికివచ్చి, అందరి ఎదురుగుండానే 'షేక్‌హేండ్' ఇచ్చి ఏమన్నాడో తెల్సా? "సొకొలోవ్, నువ్వు తెచ్చిన మంచి బహుమతికి చాలా థ్యాంక్సు. ఆ మేజరూ, వాడితో వున్న పెట్టె, మాకు చాలా విషయాలే చెప్పాయ్. నువ్వు చాలా శ్రమపడ్డావు. ఇంక నువ్వు కొన్నాళ్లు విశ్రాంతి తీసుకోవచ్చు...." అతని

మాటల్లోని ప్రేమ, అప్యాయత నన్నెంతగా సంతోషింపచేశాయో నేచెప్పలేను సోదరా! వణుకుతున్న పెదవులతోనే, "కామ్రేడ్ కర్నల్! 'రైఫిల్' యూనిట్‌లో పనిచేయటానికి నన్ను పంపండి" నన్నా....

కాని కర్నల్ నవ్వుతూ నాభుజం తట్టి "భలేవాడివేనయ్యా. కాళ్ళలో బలం లేకపోయినా, శరీరంలో శక్తి లేకపోయినా యుద్ధానికి తయారంటావ్. యుద్ధంలేదు, ఏమీలేదు. ఇక్కణ్నుండి నీవు తిన్నగా ఆస్పత్రికి వెళ్తావు. నీ గాయాలు తగ్గి మనిషిగా తయారయ్యేవరకూ అక్కడే వుంటావు. తర్వాత, ఒకనెల్లాళ్ళ సెలవు తీసుకొని మీ వూరువెళ్ళి విశ్రాంతి తీసుకుంటావ్. ఆతర్వాత ఇక్కడ కొస్తావ్. అప్పుడాలోచించి, నీకు తగినపని ఇస్తాలే...."అన్నాడు.

కర్నల్‌తోబాటు, తక్కిన ఆఫీసర్లంతా కూడా నాకు 'షేక్ హాండ్లు'ఇచ్చి, నాకు'గుడ్‌బై' చెప్పి పంపించారు. రెండు సంవత్సరాల తర్వాత, తిరిగి మనిషిగా చూడబడినందుకు, ఆరోజు నా మనసు ఎవరూ ఊహించలేనంతగా ఆనందించింది.

నేను హాస్పిటల్లో చేరిన వెంటనే, ఇరీనాకు ఒక వుత్తరం వ్రాశాను. ఆ వుత్తరంలో, మొదట నేను ఖైదీగా ఎలా పట్టుబడ్డదీ, తిరిగి, ఆ మేజరతో సహా ఎలా పారిపోగలిగిందీ, అన్నీ క్లుప్తంగా తెలియచేశా. ఆ సంతోషంలో, కుర్రాళ్ళలాగా కొన్ని కోతలుకూడా వ్రాశాను. నీతో అబద్ధం చెప్పడం ఎందుకూ? కర్నల్ నాకు 'మెడల్' ఇప్పిస్తానని వాగ్దానం చేసినట్టుగా వ్రాయటానికి కూడా నేను జంకలేదయ్యా. అదంతా ఇప్పుడు తలుచుకుంటే భలే తమాషాగా వుంటుందిలే.

రెండు వారాల వరకూ నాపని తినటం, పడుకోవటమే—నాకు కొంచెం కొంచెం ఆహారం పెట్టేవారు. నేను కోరినట్టుగాని, చాలా ఆహారం యిచ్చినట్టయితే, బాగుపడడం పోయి, పరిస్థితి ఘోరంగా మారేదని డాక్టర్ అనేవాడు—రెండు వారాలు అయిన తర్వాత, వాళ్లు నాకు ఆహారం ఇచ్చినా, సయించేదికాదు. కారణం ఇంటి దగ్గర్నుంచి జవాబురాకపోవటమే. నిజం చెప్పాలంటే, ఆ కారణంగా, నేను చాలా డీలా అయిపోయా. తిండిమీద దృష్టి పోయేదేకాదు. ఎంత ప్రయత్నించినా, నిద్రవచ్చేదికాదు—ఏవేవో వెధవఆలోచనల్తో బుర్ర వేడెక్కిపోయేది. మూడోవారంలోపుటుకు, 'ఒరునెజ్' నుంచి నాకొక ఉత్తరం వచ్చింది. కాని అది 'ఇరీనా' నుంచికాదు. నా పొరుగింటి అతను వ్రాసినది—నా గర్భశత్రువు కూడా అలాటి వుత్తరం రాకూడదు సోదరా! జర్మన్లు, ఆ గ్రామంలోని విమానాశ్రయంమీద బాంబులువేసినప్పుడు, ఒక పెద్ద బాంబు నా గుడిశెమీద పడిందట—ఆ బాంబు పడినప్పుడు, ఇరీనా, పిల్లలూ ఇంట్లోనే వున్నారంట—ఆ తర్వాత, ఇరీనా గాని, పిల్లలుగాని జాడే లేరంట. ఏంచెప్పను సోదరా! నా గుడిశె వుండాల్సిన చోటులో. ఇప్పుడొక లోతైన గొయ్యి వుందట! మొదట, అసలావుత్తరాన్ని చదవలేకపోయా. నా నడుములో ఏదో నెప్పివచ్చినట్టయి, అలాగే ఆ మంచంమీద వాలిపోయాను. తర్వాత, మళ్ళీ కాస్సేపటికి, ఎలాగో ఓపిక తెచ్చుకుని వుత్తరం చివరికంటా చదివా—ఆ వుత్తరంలో ఇంకేముందంటే....బాంబింగ్ జరిగినప్పుడు, నా పెద్ద కొడుకు 'అంటోలీ' టౌనులో వున్నాడంట, వాడు సాయంత్రం ఇంటికివచ్చి, జరిగినది తెల్సుకుని, తిరిగి, ఆ రాత్రే పట్నానికి వెళ్ళిపోయాడు. వెళ్ళేటప్పుడు, తను సైన్యంలో చేరిపోతున్నా అని మాత్రం చెప్పి వెళ్ళాడంట. అంతే. ఆ వుత్తరంలో అంతకన్నా ఇంకేమీ లేదు. నా గుండెల్లో రక్తం గూటల్లో పరుగెత్తింది....ఆనాడు, 'ఇరీనా', స్టేషన్లో నన్ను కౌగలించుకున్న దృశ్యం కళ్ళకు కట్టినట్టయింది.... ఈ ప్రపంచంలో, తిరిగి కలుసుకోలేమని అప్పుడే ఆమె ఊహించింది....అందుకే ఆమె, అలా క్రుంగిపోయింది. అది నేను గుర్తించలేక, రాక్షసుడిలా, ఆమెను తోసేశాను ఒకప్పుడు నాకూ పచ్చని కుటుంబం ఉండేది, చక్కని ఇల్లు వుండేది. ఎన్నో సంవత్సరాలు కష్టపడితే, ఆ యిల్లు కట్టుకోగలిగాను. నా సర్వస్వం ఒక క్షణంలో రూపుమాసిపోయింది....నేను ఏకాకినై పోయా. అదంతా ఒక కలై వుండాలి. శ్రమపడి సంపాదించుకున్న నా సర్వస్వం ఒక కలై వుండాలి....నేను ఖైదీగా వున్న రెండు సంవత్సరాల్లో, ప్రతీ క్షణం, నా ఇరీనా, నా పిల్లలూ, స్మృతిపథంలో నిలచేవారు.... నేను తిరిగి ఇంటికి వచ్చేస్తాననీ తిరిగి అందరూ సుఖంగా వుండొచ్చనీ, అనుక్షణం వాళ్ళకు ధైర్యం చెప్పేవాణ్ని. దానికి వాళ్లు ఆనందించి నవ్వుతూ నన్నూ నవ్వించేవారు....అయితే అదంతా అబద్ధమేనన్నమాట! రెండు సంవత్సరాలుగా, చచ్చిపోయినవాళ్ళతోనే మాటాడానన్నమాట.! అబ్బ ఆ అనుభూతులు గుర్తుకొస్తే మతిపోతుంద సోదరా....ఒక్కొక్కప్పుడూ పిచ్చయినా ఎక్కకూడదా, అవన్నీ శాశ్వతంగా మర్చిపోవచ్చుఅనుకుంటా....ఏంటో సోదరా.... జీవితం...."అంటూ అతను ఆగిపోయాడు.........గాఢంగా నిట్టూర్చి "నా బుర్రంతా వేడెక్కిపోయింది సోదరా....పొగతాగితేనేగాని తిరిగి పనిచేసేలా కనబడటంలా"అంటూ సిగరెట్ అంటించాడు. అతనితోబాటే నేనూ సిగరెట్ ముట్టించి, గట్టిగా దమ్ముపీల్చి, గాలిలోకి పొగ వదలాను....ఆకాశంలో వేగంగా పరిగిడుతున్న మబ్బుల్నిచూస్తూ, అలాగే రెండు నిమిషాలు నిశ్శబ్దంగా గడిపేశా....ఇహ వుండబట్టలేక "తర్వాత ఏమైంది?"అని అడిగాను........"తర్వాత ఏమైంది" అంటూ ఇష్టం లేకపోయినా తిరిగి మొదలెట్టాడు తన కథని"తర్వాత కర్నల్ నాకు ఒక నెల సెలవు ఇచ్చాడు. ఒకవారంరోజుల తర్వాత, నేను 'ఒరునెజ్'కు బయల్దేరా....ఒకప్పుడు, నాపచ్చని సంసారంతో వుండే ప్రదేశానికి కాలినడకనే వెళ్ళాను. అక్కడొక మురికిగుంట వుంది. దానిచుట్టూ, ఏవేవో పిచ్చిచెట్లు లేచివున్నాయ్. ఆ చుట్టుపక్కలంతా శ్మశానంలా వుంది....అది చూస్తే. నాకు భోరున ఏడుపొచ్చింది. ఇంకక్కడ ఒక్కక్షణం వుండలేకపోయా. అదేరోజు తిరిగి 'డివిజన్'కు చేరుకున్నా....

(సశేషం)

---

## వివాహ మహోత్సవం

(23వ పుట తరువాయి)

కుతూహలపడసాగారు. అందువల్ల ఆ వధూవరుల మిత్రులందరూ వారికి పెండ్లి యేర్పాట్లలో సహాయపడడానికి నిర్ణయించుకొన్నారు. వాల్యా, యురాలకు తెలియకుండా మిత్రులు బహుమానాలనుకొన్నారు. సాంస్కృతిక ప్రదర్శనలను యేర్పాటు చేశారు. యంత్రాగారపు భోజనశాల వంటలమనిషి వివాహపు కేక్‌ను తయారు చేశాడు.

వివాహానికి కొద్ది క్షణాలముందు మాత్రమే వధూవరులకు వారి మిత్రులు తాము చేసిన యేర్పాట్లను గురించి తెలియజేశారు. యురా, వాల్యాలు యెంతో ఆనందభరితులయ్యారన్న విషయం వేరే చెప్పనవసరంలేదు.

తెల్లవారుజామువరకూ వేడుకలు కొనసాగుతూనే వున్నాయి.... కొందరు వయస్సుమళ్ళినవాళ్ళు తమ పడకకుర్చీల్లో నిద్రపోవడం ప్రారంభించినా, యువకులందరూ అంతులేకుండా నృత్యాలుచేస్తూ, పాటలుపాడుతూ, ఆటలు ఆడుతూ కాలం గడిపారు.

# కొంటె ఎలుకపిల్ల



అనగనగా నొక్క
ఎలుక, దానికెంతో
చక్కనైన చిలిపి
పిల్ల వుంది ఒకటి.



"జో జో బుల్లి,
లాలి లాలి తల్లి !
మంచి మంచి రొట్టె
ముక్కలన్ని తెచ్చి,
తెల్ల తెల్ల కొవ్వు
వత్తులెన్నొ యిచ్చి
బొజ్జ నింపుతాను
జో జో బుల్లి,
లాలి లాలి తల్లి !"

పాడి పాడి లాలి
జోకొట్టుతోంటె తల్లి,



అంది చిన్న ఎలుక
తల్లితోడ నిటుల :
—"గొంతు చించుకొంటు
పాట పాడు కంటె,
దాది నొక్కదాన్ని
తెచ్చిపెట్టరాదె !"

క్షణంలోన తల్లి
ఎలుక, చెరువుకెళ్ళి,
ఈదులాడు బాతు
జూసి చెప్పె నిటులు :

—"బాతు అత్తగారు !
బిడ్డ నొక్కమాటు
జోల పాడి మీరు
నిద్ర పుచ్చి పొండు."

అడిగినంత వచ్చి
బాతు అత్తగారు
పాట మొదలుపెట్టి—

"తెల్లవారగానె
పురుగు నొకటి తెచ్చి
మేపుతాను లెమ్మ,
హాయి నిద్రపొమ్మ."

కాని తెలివిలేని
కొంటె ఎలుకపిల్ల
"వద్దు, నాకు వద్దు,
నీ పాట బాగులేదు,
వద్దు నాకు పురుగు,
వెళ్ళు మంటెచాలు !"

తల్లి ఎలుక అంత,
కప్ప పిల్ల చెంత
కరిగి పిలిచె నిటుల :

"కప్ప అత్తగారు !
బిడ్డకొక్కమారు
లాలి పాట పాడి
నిద్ర పుచ్చి పొండి."

కప్ప అత్తగారు
లాలి తెల్లవార్లు
పాడి, ఈగ నొకటి
తెచ్చిపెట్టె ప్రీతి.

"వద్దు వద్దు నాకు
నీ పాట ఉత్త రోత
నీ గొంతు వింటె చాలు
పుట్టు గుండె గుబులు."
అంది కొంటె ఎలుక
పిల్ల బుద్ధి లేక !

తల్లి ఎలుక మళ్ళీ
కాళ్ళ నీడ్చుకొంటు
పందివద్దకెళ్ళి :



"పంది అత్తగారు
బిడ్డ కొక్కమారు
లాలి పాట పాడి
నిద్ర పుచ్చి పొండి."

"చిట్టితల్లి, లాలి
కన్నతల్లి, లాలి
పెద్ద పెద్ద దుంప
తియ్య తియ్య దుంప

రెన్నో తెచ్చి యిచ్చి
బొజ్జ నింపుతాను,
కన్నబిడ్డ బజ్జో!
చిట్టిబిడ్డ బజ్జో!"

"వద్దు దుంప చేటు,
నీ పాట చాల మోటు"
అంది కొంటె ఎలుక
పంది అత్త పలుక.



అంత ఎలుక తల్లి
బయలులోని కేళ్ళి
ఆటలాడు గుర్ర
మత్తగార్ని చూసి—

"గుర్రమత్తగారు
వచ్చి ఒక్కసారి
లాలిపాడి, పాప
నిద్ర పుచ్చి పొండి."

వచ్చె గుర్రమపుడు
వింత దాదిలాగు,



"బుల్లి తల్లి నీకు
ఇష్టమేదొ చెప్పు!—
మంచి మంచి ఓట్లు
సంచిలోన గలవు,
తియ్య తియ్యనైన
గడ్డివామి గలదు."

"సకిలింత తోడ నాకు
వికలించి పోయె మనసు
మంచి మంచి ఓట్లు—
వద్దు ఎట్టి పాట్లు...."
అంది చిలిపి ఎలుక
పిల్ల బుద్ధిలేక.

క్షణంలోన తల్లి
ఎలుక, వావి కేళ్ళి,
ఈదులాడు చేప
జూసి అనెను యిటుల:

"గండు మీను గారు
ఒక్కసారి మీరు

## ఎస్. మార్షక్

లాలిపాడి, బిడ్డ
నిద్ర పుచ్చి పొండు."

గండుమీను చేప
మొదలుపెట్టె పాట,
కాని ఒక్కమాట
బయటపడదు నోట.

"గొంతు నీకు లేదు
నీ దాదితనము వద్దు"
అంది చిలిపి ఎలుక
బుద్ధి ఇంత లేక.

తల్లి ఎలుక అంత,
చెట్టుపైని చెంత
చూచె నొక్కపిల్లి
నింటి బయటికేళ్ళి

"మంచి పిల్లి గారు
ఒక్కమారు మీరు
లాలిపాడి, బిడ్డ
నిద్ర పుచ్చి పొండు."



మ్యావు మ్యావు మంటు
రాగ మాలపించి
పిల్లి పాట పాడె,
పిల్ల మనసు మారె:

"లాలి లాలి లాలి
హాయి హాయి హాయి
ఏడ్పు మానివేయి
చిరుకళ్ళు మూసివేసి
చక్కనైన చుక్క
నిదురించు నాదు ప్రక్క."

చిలిపి ఎలుక అంది;
"నీ పాట బలేగుంది
నీ గొంతు కమ్మనైంది
నీ బొచ్చు వెచ్చగుంది."

కాని. తల్లి ఎలుక
వచ్చి చూచుసరికి—
చిలిపి చిన్ని ఎలుక
ఉనికి ఎవరి కెరుక?



# యుద్ధానంతర సోవియట్ సారస్వతం


## ఎల్. యెకిమెంకో

ప్రొఫెసర్, మాస్కో విశ్వవిద్యాలయం, సోవియట్ దేశ రచయితల సంఘ సభ్యుడు


ఇటీవలి యుద్ధఘటనల గురించి వ్రాస్తూ, రచయితలు తమ శక్తి సామర్థ్యాల ననుసరించి, ఒక్క సోవియట్ ప్రజలకు మాత్రమే కాకుండా యితరులకు కూడా ఆసక్తి కలిగించిన ఒక ప్రశ్నకు సమాధానం యివ్వడానికి ప్రయత్నించారు. ఆ అపూర్వ విజయానికి మూలకారణం ఏమిటి; శిధిలమైన, దగ్ధమొనర్చబడిన స్టాలిన్‌గ్రాడ్‌లో అమరణాంతం పోరాడిన, ఓల్గానుండి బెర్లిన్ వరకూ కష్టతరమైన దుర్గమ మార్గాన్ని గడిచి, రిష్‌స్టాగ్‌పైని విజయపతాక నెత్తిన వారి నైతిక శక్తి ఎటువంటిది?

షొలఖోవ్ నవల "వారు తమ దేశం కోసం పోరాడేరు"లోని పాత్రలైన గనికార్మికుడు లొపఖిన్, కంబైన్ ఆపరేటర్ జ్వాగిన్ త్సెవ్, వ్యవసాయ శాస్త్రజ్ఞుడు స్ట్రెల్‌త్సోవ్, యుద్ధ పాతళాలలో పరిపక్వతను పొందిన సామాన్య రైతు కుర్రవాడు ఆంద్రీ లొపుఖోవ్ (బుబెన్నోవ్ నవల "తెల్ల కొండరావి"), మేధావి సెర్గీ వ్లఖోవ్ (ఎహ్రెన్‌బర్గ్ నవల "తుఫాను"). కజకెవిచ్ నవల "నక్షత్రం"లోని యువకుడైన అధికారి త్రవ్‌కిన్—వీరిలో ఒకరితో ఒకరికి పోలిక లేమీలేవు. ఎవరి భవితవ్యం వారిది. కాని వారందరూ ఒకే ఒక చాలా ముఖ్యమైన గుణాన్ని ప్రదర్శించారు వారు ఒక నూతనమైన స్థైర్యం, మానసత్వం గలవారు, తమ భవితవ్యాన్ని తమ సామ్యవాద మాతృదేశ భవితవ్యంతో జోడించినవారు, నూతన సామ్యవాద ప్రపంచ అధినేతలుగా, రక్షకులుగా ఆలోచన సాగించినవారు.

ఈ శకపు అతి చక్కని రచనలలో, బోరిస్ పొలెవోయ్ నవల "నిజమైన మనిషి కథ" ఒకటై వుండడం యాదృచ్ఛికమేమీ కాదు.

యుద్ధంపట్ల సోవియట్ రచయితల దృక్పథమూ, దాని చిత్రణా, తమ రచనల వస్తువు, శైలి, వారి ప్రతిభనూ, వైవిధ్యాన్నీ స్పష్టంగా విశదపరుస్తాయి. వైమానిక యోధుని పరాక్రమాన్ని చిత్రించే పొలెవోయ్ రచనతోబాటుగా పీరాపనోవా రచించిన "సహయాత్రీకులు"—యిది యుద్ధకాలంలో ఆస్పత్రి రైలులోని వైద్యులు, దాదులు మొదలైన సిబ్బందిని గురించి చెపుతుంది—, విక్టర్ నెక్రసోవ్ రచించిన "స్టాలిన్‌గ్రాడ్ కందకాలలో"—గొప్ప నిగ్రహంతోనూ, విచక్షణతోనూ రచింపబడిన రచనయిది—, గోన్‌ఛర్ వ్రాసిన ఉత్తేజిత రచన "పతాకధారులు" వంటి నవలలున్నాయి.

పనోవా, నెక్రసోవ్ ఉభయులూ—నెక్రసోవ్ సైనికుని పునరాగమనం గురించి యిటీవల "స్వీయనగరం" అన్న యింకో రచనను ప్రచురించారు—కొద్ది హెచ్చు తగ్గుల్లో ఆడంబరమైన పదజాలాన్ని త్యజించారు. వారిపాత్రల పరాక్రమం నిత్యజీవిత పరిస్థితులలోనూ, యుద్ధకాలంలోని వారి భావాలనూ చూపబడింది.

సోవియట్ సారస్వత పాత్రలు ధైర్యశాలురైన సామాన్యులు, యుద్ధకాలంలో అవి భయంకరమైన అగ్ని పరీక్షలను అనుభవించిన మిహాయిల్ షొలఖోవ్ "మానవుని పాట్లు"లోని ఆంద్రీ సొకొలోవ్ వంటివారు సైతం, (ఆంద్రీ భార్య, పిల్లలు హతులయ్యారు, యిల్లు నాశనమైంది, ఫాసిస్టుల బందిఖానాలో అతి కఠినమైన బాధలు పడ్డాడు), తమ జీవితాలలోని ఉదాత్తతనూ, అందచందాలనూ పూర్తిగా విశదపర్చి, మానవతను పత్రపర్చారు.

యుద్ధానికీ, సామ్రాజ్యవాద, దురాక్రమణల మొండి ప్రపంచానికీ వ్యతిరేకంగా యీ రచనలు బిగ్గరగా అసమ్మతిని తెలియజేయడం కూడా గమనార్హం. సామ్యవాద మాతృభూమిని రక్షించాలన్న భావం వాటిలో వ్యాపించివుండడం మాత్రమేకాకుండా, అవి శాంతికై విజ్ఞప్తినీ. నూతన యుద్ధసన్నాహం చేసే అధునాతన ఆటవికత్వాన్ని నిరోధించాలన్న హెచ్చరికనూ ధ్వనిస్తాయి.

నేరుగా కందకాలనుండి సారస్వత రంగానికి వచ్చిన విక్టర్ నెక్రసోవ్, ఓలెస్ గోన్‌ఛర్ వంటి యువరచయితల్లోనే కాకుండా, విప్లవానికి పూర్వమే, లేదా సోవియట్ పరిపాలన తొలి యేళ్ళలోనే రచనా జీవితాలను ప్రారంభించిన వారిలోకూడా యుద్ధానంతరకాలం చాలా కార్యనిమగ్నతను కల్పించింది.

ఇక్కడ కాన్‌స్తంతిన్ ఫెదిన్ నవలలు "తొలి సంతోషాలు"నూ "అసాధారణమైన వేసవి"నీ పేర్కొనవలసివుంటుంది.

ఫెదిన్ నవలలలో ఐక్యత, అవయవానురూపత్వమూ, సాంఘిక, వ్యక్తిగత సంబంధాల సుస్పష్ట అవగాహన ప్రముఖంగా ఉంటాయి.

యుద్ధానంతర సారస్వత ఉత్కృష్ట రచనలలో లియొనిద్ లియొనోవ్ రచించిన "రష్యన్ అరణ్యం" ఒకటి. ఈ ఏడాది యిది లెనిన్ బహుమానాన్ని పొందింది.

ఈ క్లిష్టమైన, "బహుస్వరయుతమైన" యీ నవల, రష్యన్ జీవితంలో పలుదశాబ్దాలకు విస్తరించివుంది.

ద్వితీయ ప్రపంచయుద్ధం ప్రారంభమవుతుందనగా,

* చూ. 'సోవియట్ భూమి' సంచికలు 18, 19, 20, 22.

యుద్ధకాలంలో దీని సంఘటనలు జరుగుతాయి. ప్రకృతికి సంబంధించిన కథావస్తువు. రష్యన్ అరణ్యానికి సంబంధించిన కథావస్తువు గొప్ప కవితాత్మక శక్తితో ధ్వనించు. ప్రజాజీవితంలోని నిష్కళంకమైన దానినంతటికి, ఆరోగ్యవంతమైన దానంతటికీ సంకేతరూపంలో వుంటుంది.

ఈ నవలలతోబాటు వేఫెదార్ గ్లాడ్కోవ్ త్రైసంపుట నవల (గ్రంథకర్త దీనిలో తన కఠినమైన బాల్యయవ్వనాలను వర్ణిస్తారు), విప్లవానికి ముందర ఒక గ్రామబాలుని బాల్యాన్ని కవితామయంగా వివరించే వాసిలీ స్మిర్నోవ్ వ్రాసిన "తెరచిన పుస్తకం" మొదలైన రచనలు.

వాసిలీ అజయేవ్ నవల "మాస్కోకు దూరాన," యుద్ధకాలపు అత్యంత కష్ట పరిస్థితులలో, ఉత్తరాదిని నూనెపైపు లైన్‌ను నిర్మించిన వారి గురించి చెపుతుంది. సోవియట్ ప్రజలకు సహజమైన అద్భుతమైన సమిష్టిభావం, పాత్రల వీరోచిత కృషిలో కవితాత్మకంగా ప్రదర్శింపబడింది.

అజయేవ్ నవలవలెనే చాలామంది సోవియట్ రచయితల రచనలు సమిష్టి కృషిపైని, ఏకైకలక్ష్య సాధనకొరకు దాని ఏకగ్రీవమైన కృషిపైని, సహాయకరమైన సహచరత్వ భావంపైనీ కేంద్రీకృతమై వున్నాయి.

సమిష్టిని దాని విస్పష్టమైన వ్యక్తిత్వాలతో చిత్రించి, చివరికి సమిష్టి సంఘటనలూ, యితోధికాభివృద్ధికీ దారితీసే సంఘర్షణలను రూపొందించే సామర్థ్యం, సామ్యవాద వాస్తవికతా సారస్వతానికి ఒక ముఖ్యమైన కొత్త కూర్పు.

ఇతర జీవిత విషయాలు వెనుకకు నెట్టివేయబడతాయని కాదు, దీని అర్థం.

గాలీనా నికోలయేవా "పంట" సమిష్టి దీక్షకూ, యుద్ధంవల్ల ధ్వంసం అయిన తమ ఆర్థిక విధానాన్ని పునరుద్ధరించుకునే సమిష్టి రైతుల ఉమ్మడి కృషికీ చక్కని వ్యక్తీకరణ. ఈ కథలో, కుటుంబ వ్యవహారాలకు, యింతకు తక్కువ ప్రాముఖ్యమేమీ యివ్వబడలేదు. వాసిలీ బోర్టిన్నికోవ్ ఆసుపత్రినుండి తిరిగీ యింటికివస్తే, తన ఇంట్లో అతనికి యింకో మనిషి కనిపిస్తాడు. తాను చనిపోయినట్టు విని, తన భార్య అవ్‌దోత్యా తనకోసం కనిపెట్టుకుని వుండి పోలేదు. అయినా ఈ దుఃఖకరమైన కుటుంబం సంఘర్షణ, సాంఘిక సంఘర్షణలతో సన్నిహితంగా కూర్చబడింది. ఇవ్వన్నీ గంభీరమైన, చాలా ఆకర్షణీయమైన కథగా రూపొందాయి.

సోవియట్ సారస్వత యుద్ధానంతర పరిణామం, మాస్కోలో 1954 డిసెంబరులో జరిగిన అఖిల సమాఖ్య సోవియట్ రచయితల మహాసభలో సమీక్షింపబడింది. దీనిలో పాల్గొన్న 738 ప్రతినిధులు, సోవియట్ దేశంలోని 45 జాతీయ సారస్వతాలకు ప్రాతినిధ్యం వహించారు.

ఉపన్యాసాలూ, నివేదికలూ సోవియట్ సారస్వత విజయాలకు మాత్రమే పరిమితమై లేవు. అవి దాని లోపాలను పూర్తిగా తెలియజేశాయి. దాని అభివృద్ధిని నిరోధించే ధోరణులను విమర్శించాయి. సంఘర్షణలన్నిటినీ వ్యతిరేకించి వారి సిద్ధాంతం బాగా తూర్పారబట్టబడింది. ఈ సిద్ధాంతం కొందరు విమర్శకులూ, రచయితలూ, కష్టాలను దాటువేసి, వైరుధ్యాలను విస్మరించే కొన్ని రచనలూ తయారు చేసినటువంటిది. అదే సమయంలో సోవియట్ వాస్తవికతకు మసిపూసి, దాని లోపాలను అతిగా చిత్రించే రచనలుకూడా తీవ్ర విమర్శకు గురి అయ్యాయి.

కమ్యూనిస్టు పార్టీ ఇరవైయ్యవ మహాసభ, మా దేశపు సాంఘిక-రాజకీయ జీవితానికీ, సాహిత్య జీవితానికికూడా ప్రత్యేకమైన ప్రాముఖ్యం గలది. వ్యక్తి ఆరాధన దుష్ఫలితాలపైని నిర్దాక్షిణ్యమైన విమర్శ, గత కాలపు తప్పిదాలను ధైర్యంగా సరిదిద్దడమూ, వ్యతిరేక లక్షణాలను తొలగించడానికి సమిష్టి కృషి, కమ్యూనిజంవేపుకు సోవియట్ ప్రజలు యింకా పురోగమించేందుకు వైజ్ఞానిక ప్రాతిపదికపై కార్యక్రమమూ సారస్వతానికి గొప్ప నవావకాశాలను కలిగించాయి.

"జిల్లాలో నిత్యజీవితం", "కష్టభరితమైన వసంతం" అన్న పేరుతో, యీ ఏడాది ఐదులక్షల ప్రతులలో ప్రచురింపబడిన ఒవెచ్‌కిన్ వ్యాస సంపుటాలు, గత సంవత్సరాల అద్భుతమైన చరిత్రలు.

"అనుచితం", "దుర్గ్రాహ్యం" అన్న యువ రచయిత తెండ్రియకోవ్ నవలల గురించి చాలా వాదోపవాదాలు జరిగాయి.

ఇంకో రచయిత పావెల్ నిలిన్ గతకాలపు సంఘటనలను, సోవియట్ రాజ్యపు తొలి సంవత్సరాలను తీసుకుని, "పరీక్షకాలం", "క్రూరత్వం" అన్న నవలలను రచించారు. చాలా తీక్ష్ణత వున్నప్పటికీ ఈ రెండు రచనలలో ప్రగాఢమైన భావన, కమనీయత లోపించు లేదు.

పావెల్ నిలిన్ రచనలలో సామ్యవాదంకొరకు పోరాడే మానవుని నైతిక సౌందర్య విమర్శతో బాటుగా, సమర్థనకూడా జోడింపబడి వుంది.

* * *

సోవియట్ సారస్వతం వయస్సు నలభై ఏళ్ళు మాత్రమే అయినప్పటికీ, చారిత్రకంగా అది చిన్నదే అయినప్పటికీ, అది ఇప్పటికే ప్రామాణికమైన గ్రంథాలను ఉత్పత్తిచేసి, ప్రపంచ సారస్వతానుభవ నిధిలో ఒక భాగమైపోయింది.

సోవియట్ సారస్వతం ధైర్యంగా, ప్రజల జీవితంతోనూ, పోరాటంతోనూ చెట్టపట్టాలు పట్టి పురోగమిస్తోంది.

# "స్పుత్నిక్కులు"

(25వ పుట తరువాయి)

వాతావరణంలోని వివిధస్థాయి వత్తిడుల ప్రభావాలకు లోనయినప్పుడు, వాటి పరిభ్రమణావలయాలు భిన్న ఆవేగాలతో మారుతాయి గనుక, కొంతకాలానికల్లా భిన్నమైన కక్ష్యల్లో పరిభ్రమించవలసివస్తాయి. పరిభ్రమణ వలయంలోని నీచస్థాయి, భూమికి యెక్కువ సమీపంలో ఉండే కక్ష్య కుంచుకొని పోతుంది.

ప్రారంభంలో మొదటి స్పుత్నిక్కూ, దాని వాహక రాకెట్టూ దాదాపు ఒకే కక్ష్యలో పరిభ్రమిస్తూ వచ్చాయి. భూప్రదక్షిణకు రెండిటికీ పట్టేకాలంలో యెక్కువ తేడా వుండేది కాదు. 96.2 నిముషాల్లో ఒకసారి భూపరిభ్రమణం చేస్తుండేవి. కాని ఇప్పుడు, మొదటి స్పుత్నిక్ యొక్క వేగంలోని తగ్గుదల దాని వాహక రాకెట్ వేగం తగ్గుదలకంటే తక్కువగా ఉండడంవల్ల వాటికక్ష్యలు వేరువేరుగా వుంటున్నాయి. వాహక రాకెట్ కక్ష యొక్క అత్యున్నతస్థాయి స్పుత్నిక్ కక్ష యొక్క అత్యున్నతస్థాయికంటే 100 కిలోమీటర్లు తక్కువగా వున్నది. నవంబరు 10వ తేదినాటి సమాచారంప్రకారం వాహక రాకెట్ యొక్క భూప్రదక్షిణ కాలపరిమితి స్పుత్నిక్ యొక్క భూ ప్రదక్షిణ కాలపరిమితికంటే అప్పుడే 71 సెకెండులు తగ్గిపోయింది. కక్ష్య కొలతలు మారడం మూలంగా కాలానుక్రమంగా వాతావరణపు ఒరిపిడిద్వారా వాహకరాకెట్టు, స్పుత్నిక్‌లపై కలిగే ప్రభావంలో కూడా మార్పులు వస్తుంది. కక్ష్య స్థాయి తగ్గుతున్న కొద్ది వాతావరణపు ఒరిపిడివల్ల కలిగే ప్రభావం ఎక్కువవుతుంది. పరిశీలనల ఫలితాలు యీ విషయాన్ని స్పష్టంగా ధృవపరుస్తున్నాయి. కక్షస్థాయి 100 కిలోమీటర్లకు పడిపోయినప్పుడు స్పుత్నిక్‌పైనా, వాహకరాకెట్‌పైనా వాతావరణపు ఒరిపిడి యెంత అధికంగా ఉంటుందంటే, అవి రెండూ తీవ్రంగా వేడెక్కిపోయి, అత్యంత వేగంతో పడిపోతూ కాలిపోతాయి.

స్పుత్నిక్ యొక్క జీవితపరిమాణం వాతావరణపు ఒరిపిడి ప్రభావంపై ఆధారపడి ఉంటుంది. భూప్రదక్షిణకు పట్టేకాలం ఎంత యెక్కువయితే, ఒరిపిడి అంతతక్కువయి, అంత యెక్కువకాలం స్పుత్నిక్ రోదసిలో ఉండగలుగుతున్న విషయంసుస్పష్టం. మొదటి స్పుత్నిక్ యొక్క, దాని వాహక రాకెట్ యొక్క పరిభ్రమణ గమనాన్ని జాగ్రత్తగా పరిశీలించిన విషయాల ప్రాతిపదికపైన కట్టిన లెక్కల ప్రకారం, ఎగురవేయబడిన తేదీ మొదలుకొని స్పుత్నిక్ మూడునెలలపాటు అంతరిక్షంలో వుంటుందని నమ్మడానికి వీలవుతున్నది. అనగా మొదటి స్పుత్నిక్ దాని కక్ష్యలో ఈ సంవత్సరాంతంవరకు పరిభ్రమిస్తూ ఉంటుందన్నమాట. వాహక రాకెట్ యొక్క జీవిత పరిమాణం మొదటి స్పుత్నిక్ జీవిత పరిమాణం కంటే తక్కువగా ఉంటుందిగనుక, అది స్పుత్నిక్ కంటే ముందుగానే కాలిపోతుందని భావించవచ్చును. రెండవ స్పుత్నిక్ యొక్క భూప్రదక్షిణ కాల పరిమితి యెక్కువ కావడం వల్ల, దానిపైన కలిగే వాతావరణపు ఒరిపిడి ప్రభావం తక్కువగా వుండి, అది దాని కక్ష్యలో మొదటి స్పుత్నిక్ కంటే యెక్కువ కాలం పరిభ్రమిస్తూ ఉండవచ్చునని నమ్మడానికి అవకాశం కలుగుతున్నది.

ప్రక్షేపక్రియ కొలతల ఫలితాలను క్రమబద్ధం చేయడానికి ఇప్పుడు జరుగుతున్న కృషిమూలంగా రెండు స్పుత్నిక్‌ల కృషి కొలతల పరిణామక్రమాన్ని సంపూర్ణంగా నిర్ణయించడానికి, వాతావరణపు పైపొరలలో సాంద్రత యెక్కడెక్కడ యెలాగున్నదో తెలుసుకోడానికీ వీలవుతుంది. ఆపైన, స్పుత్నిక్‌లు యెంత కాలం అంతరిక్షంలో ఉంటాయి అన్న విషయాన్ని గురించి నమ్మకంగా జోస్యం చెప్పగలం.

## రెండవ స్పుత్నిక్ నిర్మాణము

ఇదివరకే తెలియజేయబడినట్లు రెండవ సోవియట్ స్పుత్నిక్, మొదటి స్పుత్నిక్ వలెగాక ఒక రాకెట్ యొక్క అంతిమదశగా ఉండినది. అన్ని రకాల వైజ్ఞానిక, కొలత పరికరాలు అందులో వుంచబడ్డాయి. ఈ విధంగా ఆ పరికరాలను ఉంచడంవల్ల స్పుత్నిక్ యొక్క గమనాన్ని దృక్ యంత్రాలద్వారా పరిశీలించడం సులభమవుతుంది. ఎందువల్లనంటే మొదటి స్పుత్నిక్‌కు సంబంధించిన పరిశోధనల సందర్భంలో, స్పుత్నిక్ గమనాన్ని పరిశీలించడంకంటే, దాని వాహక రాకెట్‌ను పరిశీలించడం సులభమని తేలింది. వాహక రాకెట్ యొక్క తేజం స్పుత్నిక్ యొక్క తేజం కంటే అనేకరెట్లు నక్షత్ర తేజ పరిమాణాలు యెక్కువగా వున్నది. రెండవ స్పుత్నిక్ యొక్క మొత్తం బరువు, పరిశోధనకొరకు ఉంచిన జంతువు, బ్యాటరీలతో సహా, 508.3 కిలోగ్రాములు ఉన్నది.

రాకెట్ యొక్క చివరి అంచె ముందుభాగంలో సౌరవర్ణ

*

క్రమానుసారంగా నిర్మితమైన రెండవ స్పుత్నిక్ యాంత్రిక విభాగ వివరణ: 1. శంఖువలె వుండి, స్పుత్నిక్ దాని కక్ష్యలోకి ప్రవేశించగానే విడిపోయిన రక్షక విభాగం. 2. సూర్య, ఎక్సరే కిరణ ప్రసార పరిశీలక సాధన. 3. గోళాకృతిలో వున్న రేడియో ప్రసార పరికర విభాగం. 4. పరికరం అమర్చబడిన చట్రం. 5. లోపలికి గాలి ప్రవేశించకుండా కట్టబడిన అరలో జంతువు వున్న అర




*

రెండవ స్పుత్నిక్‌లో పెట్టబడిన శాస్త్రపరికరాల విభాగం



పటలంయొక్క అల్ట్రా వైలెట్, ఎక్స్-కిరణ మండలాల్లో సౌరకిరణ ప్రసారాన్ని గురించి పరిశోధనలు జరపడానికి అనువైన యంత్ర పరికరాలు, రెండు రేడియో ప్రసారయంత్రాలు, ఇతర యంత్రాలు గల ఒక గోళాకారపు డబ్బా, ప్రయోగార్థం ఒక జంతువును (కుక్క) ఉంచి గాలి చొరకుండా బిగించిన ఒక పెట్టె అమర్చబడి వున్నాయి. కాస్మిక్ కిరణ ప్రసార పరిశోధనలకుపయోగపడే యంత్ర పరికరం రాకెట్ పైభాగానికి బిగించబడింది. రాకెట్ పైకి ఎగిరేటప్పుడు వాతావరణపు దట్టపు పొరల ఒరిపిడివల్ల కలిగే ఉష్ణప్రభావాలనుండీ, ఎయిరో డైనమిక్ ప్రభావాలనుండీ రాకెట్‌లోని పరిశోధక యంత్ర పరికరాలను కాపాడడానికి ఒక కూచి ఆకారపు డిప్ప అమర్చబడింది. చివరి అంచె రాకెట్ దాని కక్ష్యలోకి చేరుకొన్నాక రక్షణకొరకు



రెండవ స్పూత్నిక్‌లో గాలి చొరని అరలోనికి ఎక్కించబడిన కుక్క "లైకా"

★

యేర్పాటు చేయబడిన కూచి ఆకారపు డిప్ప విడగొట్టివేయబడింది.

గోళాకారపు డబ్బిలో ఉంచబడిన రేడియో ప్రసార యంత్రాలు సెకెండుకు 40.002, 20.005 మెగా సైకిల్‌ల ఫ్రీక్వెన్సీలపైన పని చేయసాగాయి. ఎలక్ట్రిక్ బ్యాటరీలు, వేడిని క్రమపరిచే యేర్పాట్లు, తాపక్రమపు మార్పులను నమోదుచేసే సున్నితమైన యంత్రాలు, ఇతర కొలత యంత్రాలుగూడా ఇందులోనే వుంచబడ్డాయి. ఈ గోళాకారపు డబ్బా, దాని నిర్మాణంలో మొదటి స్పూత్నిక్‌ను పోలి వున్నది.

20.005 మెగా సైకిల్‌ల (15 మీటర్ల) పైన పనిచేస్తున్న రేడియో ప్రసార యంత్రం పంపుతున్న సంజ్ఞలు టెలిగ్రాఫిక్ రూపంలో 0 3 సెకెండ్ల కాల పరిమితితో, ఒక సంజ్ఞకు, మరొక సంజ్ఞకు మధ్య అదే కాలపరిమితి వ్యవధితో వుంటున్నాయి. గోళాకారపు డబ్బాలోని స్థితియొక్క (తాపక్రమం, సత్తియొక్క) మార్పులవల్ల ఈ సంజ్ఞల కాలపరిమితిలోను, ఒక సంజ్ఞకు మరొక సంజ్ఞకు మధ్య వ్యవధిలోను మార్పులు కలుగుతూ వచ్చాయి.

10.002 మెగా సైకిల్‌లు (7 5 మీటర్ల) పైన పనిచేస్తున్న ప్రసారక యంత్రం నిరంతరం ప్రసారాన్ని జరుపుతూ వచ్చింది రెండు ప్రసారయంత్రాలు వాటికి నిర్దేశింపబడిన ఫ్రీక్వెన్సీల ననుసరించి పనిచేయడంవల్ల, స్పూత్నిక్ నుండి విడుదలైన రేడియో తరంగాల ప్రసారాన్నీ, స్పూత్నిక్‌యొక్క కక్ష్య కొలతలనూ పరిశీలించి తెలిసికొనడం సాధ్యమయింది. అంతేగాక, అన్ని అయొనోస్ఫిరిక్ పరిస్థితుల్లోను స్పూత్నిక్‌నుంచి సంజ్ఞలు వస్తాయని నమ్మకంగా తేలింది. రేడియో ప్రసారక యంత్రాలకు నిర్దేశించిన వేవ్ లెంగ్తులు, వాటి ఏంపిల్ పవర్‌లు, ప్రత్యేకంగా యేర్పాటు చేయబడిన కేంద్రాలతోపాటు, ఔత్సాహిక రేడియో ఆపరేటర్లు గూడా స్పూత్నిక్ గమనాన్ని పరిశీలించడానికి తోడ్పడ్డాయి.

పరిశోధనార్థం జంతువును (కుక్కను) ఉంచి గాలి చొరకుండా బిగించిన పరికరం గుండ్రని గొట్టం రూపంలో ఉన్నది. కుక్క జీవించి వుండానికి అనువైన పరిస్థితులను కల్పించేందుకు అందులో ఆహారం ఉంచబడింది; రిజనరేషన్ ఇన్‌స్టలేషన్, వేడి రెగ్యులేషన్ సిస్టమ్‌లతో కూడిన గాలిని సమతాపక్రమంలో ఉంచే యేర్పాట్లు చేయబడ్డాయి. వీటితోపాటు నాడి కొట్టుకోవడాన్నీ, ఉచ్ఛ్వాసనిశ్వాసాలను, రక్తపు వత్తిడినీ రికార్డుచేసే పరికరాలు, ఎలక్ట్రో కార్డియోగ్రాములను తీయడానికి అవసరమైన పరికరాలు, లోపలి పరిస్థితులను (తాపక్రమాన్ని వత్తిడిని) కొలవడానికి సున్నితమైన ఇతర పరికరాలు గూడా ఉంచబడ్డాయి.

పరిశోధనార్థం జంతువు వుంచబడిన గుండ్రని గొట్టాము, గోళాకారపు డబ్బా అల్యూమినియం యొక్క మిశ్రమలోహంతో తయారు చేయబడ్డాయి. వాటి పైభాగం సౌరకిరణాలను పరిగ్రహించి, ప్రసారం చేయడానికి అనువుగా మెరుగుపెట్టబడ్డది. గోళాకారపు డబ్బాలోనూ, జంతువును ఉంచిన గుండ్రని గొట్టాములోనూ వేడిని అజమాయిషీలో ఉంచడానికి చేయబడిన యేర్పాట్లు, గ్యాస్ సర్క్యులేషన్ పద్ధతిద్వారా వేడిని స్పూత్నిక్ స్థూలభాగంలోకి వెడలగొట్టి తాపక్రమాన్ని ఒక నిర్ణీతస్థితిలో ఉంచుతూ వచ్చాయి.

పైన చెప్పబడినవేగాక చివరి అంచె రాకెట్‌లో రేడియో టెలీమీటరింగ్ కొలత పరికరాలు, తాపక్రమాన్ని కొలిచే పరికరాలు, వైజ్ఞానిక, కొలత యంత్రపరికరాలను నడుపడానికి ఎలక్ట్రిక్ బ్యాటరీలు కూడా ఉంచబడ్డాయి. స్పూత్నిక్ పైభాగపు తాపక్రమము, జంతువు ఉన్న గొట్టంలోని తాపక్రమము, ఇతర పరికరాల తాపక్రమము వాటిపైన ఏర్పాటు చేయబడిన తాపక్రమప్రసార యంత్రాల ద్వారా తెలుసుకొనబడుతూ వచ్చింది. స్పూత్నిక్‌లో పరిగ్రహింపబడిన కొలతల వివరాల నన్నింటిని రేడియో టెలీమీటరింగ్ యంత్ర పరికరం భూతలంమీది కేంద్రాలకు పంపుతూ వచ్చింది. ప్రత్యేకంగా యేర్పాటు గావింపబడిన ఒక కార్యక్రమం ప్రకారం ఆ సమాచారమంతా దఫదఫాలవారీగా ప్రసారం చేయబడుతూవచ్చింది. (సశేషం)



దేశ దేశాల పర్యటించి, సుప్రసిద్ధ ఛాయాచిత్ర గ్రాహకులు, శ్రీ పి. ఎన్. శర్మ, ఢిల్లీలో ఆకర్షణీయమైన అనేక ఛాయాచిత్ర ప్రదర్శనల విజయప్రదంగా జరిపారు.

ఇటీవల, శ్రీ శర్మ, భిలాయ్ లోని, భిలాయ్ ఉక్కు పరిశ్రమాగారాన్ని సందర్శించి, ఆ సందర్భంగా తీసిన ఛాయాచిత్రాలు, రాబోవు 'సోవియట్ భూమి'లో వెలువరించబడుతున్నాయి. ఇవిగాక, ఆ సంచికలో భిలాయ్ పరిశ్రమాగారానికి సంబంధించిన అనేక వ్యాసాలుంటాయి.

## పరదేశీ చిత్రాన్ని గురించి



"పరదేశీ" చలనచిత్ర నిర్మాతలు ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూతో. కథానాయకుడు ఒలెగ్ స్ట్రిజెనోవ్, శ్రీ నెహ్రూతో సంభాషిస్తోన్న దృశ్యం.

*

# అంతర్జాతీయ సౌహార్ద్రతకు అంకురార్పణ

**కె. ఎ. అబ్బాస్**

పదహేనవ శతాబ్దంలో వాస్కో-డి-గామాకన్న ఇరవై అయిదు సంవత్సరాలకు పూర్వం, భారత దేశానికి వచ్చిన వర్తకుడు, పండితుడు, యాత్రికుడు, "పరదేశీ" అయిన అఫనసీ నికితిన్ కథ, సహజంగా భారత-సోవియట్ మైత్రికి అంకితమైన చిత్రానికి చక్కటి ఇతివృత్తమైంది. కాగా అఫనసీ నికితిన్ భారత దేశంలో విస్తృతంగా పర్యటించడమేగాక భారత ప్రజా సామాన్యంలో తానొకడై జీవించాడు. ఆ ప్రజలు ఏదితింటే తనూ అదే తిన్నాడు. ఒక్కొక్కప్పుడు ఆ ప్రజలలాగే తనూ అవే దుస్తులుకూడా వేసుకున్నాడు. ఆయన, తర్వాత ఈ దేశానికి వచ్చిన ఇతర ఐరోపా యాత్రికులవలె సామ్రాజ్యవాద ప్రయోజనాల దృష్ట్యా చారుని వలె దేశాన్ని అన్వేషించలేదు. ప్రజాజీవితాన్ని పరిశీలించడం, వర్తక వాణిజ్యాలకున్న అవకాశాలను కనిపెట్టడమే ఆయనకు పరమలక్ష్యమైంది, మన ఉభయ దేశాల ప్రస్తుతసౌహార్ద్ర సంబంధాలకు ఆయన కథ ఒక చక్కటి చారిత్రికాధారమవుతున్నది.

ఈ కథను, తెరకు అనువగా అనువదించడానికి చక్కటి "సాధన" అయినది, భారత, సోవియట్ సినీ కళాకారులు చిత్ర నిర్మాణపు ప్రతి విభాగంలోనూ సమాన ప్రతిపత్తిమీద, సంయుక్తంగా —ఇద్దరు సినేరియా రచయితలు, ఇద్దరు దర్శకులు, ఇద్దరు ఛాయా చిత్ర గ్రాహకులు, ఇద్దరు శబ్ద గ్రాహకులు ఇద్దరు ఎడిటర్లు హిందీ, రష్యన్ భాషల మాట్లాడే భారత, సోవియట్ నటీనటబృందం చేసిన సహకార కృషి ! ఈ కృషి అపూర్వమైంది. సంశయాళువులు అనేకులు, ఇటువంటి సృజనాత్మక భాగస్వామ్యానికి లేశమంత అవకాశమన్నా వున్నదా అని ఎంతో శంకించారు. వివిధ జాతీయరీతులను, చిత్ర నిర్మాణ సంప్రదాయాలను, విభిన్న వ్యక్తిగతాభిరుచులను, స్వభావాలను సమన్వయించుకోవడమన్న సమస్య అది. అంతేగాక నిర్మాణంలోనూ, ఎన్నో అంతకన్న జటిలమైన సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చినది. చిత్రం, భారత దేశంలోనూ, సోవియట్ దేశంలోను, కాస్పియన్, అరేబియన్ సముద్రతీర ప్రాంతాలలోను, ఓల్గా నది వొడ్డున, కొంకణ ప్రాంతపు వరి పొలాలలోను, హిమావృత ప్రాంతాల, ఎడారి ఇసుక-తుఫాను దృశ్యాల వివిధంగా షూట్ చేయవలసివచ్చినది. మాస్కో-వాసులు దక్షిణ భారతపు ఉష్ణాధిక్యతను, బొంబాయి వాసులు సున్నాకన్నా ఉష్ణోగ్రత తక్కువైన అత్యధిక శైత్యాన్ని భరించవలసి వచ్చింది. భారతీయులు, రష్యన్లూ ఇద్దరూ, ఈ కృషిలో పరస్పర భావ ప్రకటనకు ఒక 'వాడుక భాషను' సృష్టించుకోవలసి వచ్చినది. అనువాదకులు, నిఘంటువులు, సంభాషణ బోధినులు చేయగలిగిన సహాయంకన్న, మనసులు విప్పి, ఒకరొకరిని అర్థం చేసుకోవడానికి నాల్కలుచాచి, ఆకర్ణించడానికి చెవులు మిన్నగా విప్పార్చవలసి వచ్చినది.

వెనుకకు తిరిగి ఒక్కసారి చూచుకున్నట్లయితే మాకు ఎదురైన కష్ట పరంపరలు స్పష్టంగా కనుపించకపోవు. కానీ ఓర్మిలో, సహజ వివేకంతో, పరస్పర విశ్వాసంతోటే ఈ కష్టాలను గట్టెక్కగలిగామన్నది గమనార్హమైన విషయం. దీని వల్ల అవరోధాలు లేకుండా చిత్రనిర్మాణం కొనసాగి, కడపటికి చిత్రాన్ని ప్రదర్శనకు సన్నద్ధం చెయ్యగలిగాము.

అయినా భారత-సోవియట్ ప్రజలకు సంయుక్తంగా నిర్మితమైన మా చిత్రాన్ని ప్రదర్శించబోతున్నప్పుడు మా కొక విధమైన సభాకంపన లేకపోలేదు. ఇది వారికి ఆసక్తిదాయకంగా వున్నట్లయితే మాకు తృప్తి కలుగుతుంది. ఉభయ ప్రజలూ దీనిలో తమ జీవిత, సాంస్కృతిక వాస్తవ ప్రతిబింబాన్ని చూడగలిగినట్లయితే మేము సంతోషిస్తాము. మరి వారూ—ఈ చిత్రాన్ని సందర్శించే ప్రపంచప్రజలూ—అంతర్జాతీయ మైత్రి, సౌహార్ద్రత, సౌభ్రాత్రుత్వాల సందేశాన్ని దర్శించగలిగినట్లయితే మా శ్రమ నిజంగా ఫలప్రదమైనట్లు భావిస్తాము.

దేశ దేశాలకు చెందిన వివిధ ప్రజల సాంస్కృతిక సహకార స్వర్ణహారంలో ఈ చిత్రం ఒక కొలికిపంటిది. ప్రపంచమంతటా ఈనాడు అధికాధికంగా వివిధ ప్రజలు, పరస్పర భావ వ్యక్తీకరణకు, ఒకరొకరు అర్థం చేసుకోవడానికి ఎక్కువగా కవిత్వం, సంగీతం, నాటకం, సినీమా ఉత్తమ సాధనలు కాగలవన్న పరమ సత్యాన్ని గుర్తిస్తున్నారు. కళా క్షేత్రాలలో అంతర్జాతీయ సహకారానికి ఒక వినూత్న అద్భుత క్రమాన్ని విరచించిన అగ్రగాములన్న విశేషాధిక్యతకు బహుశా మేమే అర్హులమవుతామేమో.

మాస్కోను వీడిచిపెట్టబోయేముందు విచారగ్రస్తులమై మేము తిరుగు ప్రయాణ సన్నాహాలు చేసుకుంటుండగా ఒక్లే-యా, గ్రీకు చిత్ర కళా బృందాలు సంయుక్త చిత్రనిర్మాణానికి ఇక్కడికి వస్తున్నాయి. భారత దేశంలోకూడా చైనా, జపాన్ దేశాలతో కలసి చిత్రాలు తియ్యాలన్న సంప్రదింపులు అప్పుడే ప్రారంభమైనాయి మా చిత్రం పరిసమాప్తం కావడం, అంతర్జాతీయ సౌహార్ద్రత కంకితమైన అనేక చిత్రాల నిర్మాణానికి అంకురార్పణన్నట్టుంది.

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరపున, జి. ఎఫిమోవ్‌చే 25, బారాకంబా రోడ్, న్యూఢిల్లీ నుంచి సంపాదితము, ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు : పంజాబి ప్రెస్, సదర్ బజార్, ఢిల్లీ—6.

# వినోద చిత్రాలు







స్త్రీలూ, టెలిఫోన్లూ!



చర్చిల్: "బోల్షివిక్కులు భూతలిని విడిచిపెట్టాల్సి వస్తుందని నలభై ఏళ్ళ క్రిందటే నేను చెప్పలేదూ?"











గుమాస్తా!

